    

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# సాంప్రదాయిక వ్యాస మాలిక–15



పుండరీకాక్ష పెరుమాళ్, తిరువెళ్ళరై




'పండితరత్న'

డా॥ ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అమ్రుగ శింగరాచార్యులు


సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయ సూచిక

# భక్తితత్త్వమ్

## శ్రీ అణ్ణంగరాచార్యస్వామివారి ద్రావిడవ్యాసానికి అనువాదం

లోకంలో కనిపించే మహాత్ములను మనం రెండు విధాలుగా వర్గీకరించి పలుకుతాం. కొందరిని మహాజ్ఞానులు అని అంటాము. మరికొందరిని మహాభక్తులు అని పొగడుతాం. పాండిత్యం, పరమ భక్తి అనేవి ఒకే వ్యక్తిలో చేరి ఉండడం అనేది అసాధ్యమైనది ఏమీ కాదు. చీకటి, వెలుగు అనే రెండు ఒకటిగా ఒకచోట చేరి ఉండడం అనేది సాధ్యం కానట్లుగా, ఈ జ్ఞానం, భక్తి అనేవి ఒకటిగా చేరి ఉండడం సాధ్యం కానివి– అని అనుకోనక్కరలేదు. మన పూర్వాచార్యులు, ఇంకా పలువురు పెద్దలు జ్ఞాన భక్తి వైరాగ్య నిధులుగా ప్రకాశించినవారే. అయితే, ఈ కాలంలో వీటిని మనం ఒకే వ్యక్తిలో దర్శించడం అనేది అరుదైపోయింది. జ్ఞానం కలిగినవారిలో భక్తి, అనుష్ఠానం కనబడడం లేదు. ఇవి కనిపించే చోట జ్ఞానాన్ని దర్శించడం అనేది అరుదైపోయింది.

లోకంలో, జ్ఞానులకు గౌరవం అధికమా? భక్తులకు గౌరవం అధికమా?అని మనం గమనిస్తే, నిజానికి భక్తిని కలవారికి గౌరవం అధికంగా ఉండాలి. అయితే, జ్ఞానులకే అధికమైన గౌరవం అక్కడక్కడ ఇవ్వడం గమనిస్తున్నాం. దీనికి కారణం ఏమి అంటే, వీరు దొంగ భక్తులా? నిజమైన భక్తులా? అని యథార్థంగా చూసి నిశ్చయించడం లేదు. విద్వాంసులు అనే వర్గంలో కూడా, నిజమైన విద్వాంసులు, ఆభాస విద్వాంసులు అనే తేడా ఉన్నప్పటికీ, వారి నోటి నుండి బయటకు వచ్చే

మాటలను బట్టి వీరు నిజమైన పండితులు, వీరు దొంగ పండితులు అని తెలుసుకోవడం సాధ్యపడుతున్నది. భక్తిని కలవారిని ఈ విధంగా తెలుసుకోవడం సాధ్యం కాని కార్యంగా ఉన్నది.

భక్తులని బయటకు తెలియజేయగలిగిన వేషభూషణాధులను ధరించడం అందరికీ సులభం అవుతున్నది. కాని, మనస్సు లోపల పరిపక్వతను చెందిన భక్తి కలగడం చాలా అరుదై ఉన్నది. ద్వాదశ ఊర్ధ్వపుండ్రాలను అందంగా, స్పష్టంగా ధరించి, తులసి పూసల మాలలు, పవిత్రాలు మొదలైనవానిని ధరించి, "వీరు భాగవతోత్తములు" అని లోకంలో అందరూ ఆనందించి పొగిడేటట్టుగా వేషంతో బయటకు రావడంలో పెద్ద శ్రమ ఏమీ లేదు. ఈ విధంగానే, శిరస్సునుండి పాదం వరకు విభూదిని పూసికొని, రుద్రాక్ష మాలలను ధరించి, శివభక్తశిఖామణులుగా వెలుగడంలో కూడా కష్టం ఏమీ కాదు. కానీ, మనస్సులో దృఢంగా ఉండే పాపవాసనలను పోగొట్టుకొని, పరమేశ్వరుని విషయంలో నిజమైన భక్తిని కలిగి, తన్మయత్వాన్ని కలిగి ఉండడం అనేది ఒకటే కష్టసాధ్యం, కాలవిలంబంలో చాలా శ్రమతో పొందదగినది కూడా.

భక్తులని అనిపించే బాహ్యవేషాలను ధరించి ఉండడంతో మాత్రం ఒకడు నిజమైన భక్తుడుగా కాబోడు. అనాదికాల సంచితమైన పాపాలు పోయి, దుర్వాసనలు తొలగి, పరమ పురుషుని విషయంలో పరవశమైన భక్తి ఏర్పడినప్పుడే భక్తుడుగా కావడం సాధ్యమవుతుంది– అనే విషయాన్ని ఒక్కొక్కరూ మనస్సులో దృఢంగా పెట్టుకోవాలి. అయితే, భక్తియొక్క బాహ్యచిహ్నాలు ఆవశ్యకం కాదు– అని చెప్పడం లేదు. అవి

చాలా ఆవశ్యకమే అనేదానినిగూర్చి ఇంతకుముందే తెలియజేశాను. బాహ్యచిహ్నాలను ధరించినందువల్ల మాత్రం తృప్తిని పొందకుండా, వాస్తవమైన భక్తిని పొందడం కోసం ప్రయత్నం చేయాలి.

గొప్ప గొప్ప ధర్మకార్యాలను చేసేవారే భక్తులని కొందరు భావించవచ్చు బావులను తవ్వడం, సత్రాలను చావడులను కట్టించడం, చలువ పందిళ్ళను వేయించడంవంటి పలు ధర్మకార్యాలు చేసేవాడు భక్తుడు అని కొందరు భావించవచ్చు, అయితే, నిజం చెప్పవలసి వస్తే, ఈ కార్యాలు ఒక విధంగా గొప్పవే అయినప్పటికీ, ఈ విధమైన కార్యాలు చేసినందువల్లనే ఒకడు భక్తుడనే పేరుకు పూర్ణమైన యోగ్యతను కలవాడు అవుతాడు– అని అర్థం కాదు. ఈ విధంగా ఉండే పెద్ద పెద్ద ధర్మకార్యాలను చేయడం అందరికీ వీలు కాదు. ఎవరో కొందరు మాత్రమే వీటిని చేయగలరు. ఆ విధంగా చేసేవారే విశేషధనికులు అని, విశాలమైన మనస్సు కలవారని చెప్పగలం తప్ప, భక్తులని చెప్పడానికి వీలు కాదు.

అయితే, మరి, నిజమైన భక్తుని గుర్తు ఏమి? అనే ప్రశ్న వస్తుంది. నిజమైన భక్తుని చూడడం అరుదే అయినప్పటికీ కష్టం ఏమీ కాదు. భగవంతుని విషయంలో స్వార్థాన్ని భావించని ప్రేమను కల భక్తుని విషయంలో ఏ సమయంలో అయినా మనం విశేషాన్ని గమనించవచ్చు. ఏ కాలంలో అయినా, ఏ దేశంలో అయినా, ఏ స్థితిలో అయినా భక్తులు భక్తులుగానే ఉంటారు. స్నానం చేయడం, భుజించడం మొదలైన కార్యాలను చేసేటప్పుడు, బంధుమిత్రాదులతో వ్యవహరించేటప్పుడు, వ్యాధులతో బాధపడేటప్పుడు, పలు విధాలయిన కష్టాలు

ఏర్పడినప్పుడు, విశేషమైన లాభాలు లభించినప్పుడు భక్తుడు భక్తుడు గానే ఉంటాడు. అన్ని సమయాలలోనూ, అన్ని దేశాలలోనూ, అన్ని స్థితులలోనూ అతని సాధారణమైన స్థితి మారకుండానే అతడు ఉంటాడు. ఏ విధమైన అతిశయం అతనిలో కనిపించదు. ఎల్లప్పుడూ సహజమైన సంతోషంతో శాంతమూర్తిగా ఉంటాడు. ఏ విధమైన మార్పు అతనిలో కనిపించదు. గొప్ప ఆపదలలోకూడా తన స్థితి నుండి మార్పును పొందడు. సహనం, దయ, శాంతి, పరిశుద్ధి, ఇంకా ఇటువంటి మంచి గుణాలు అతనిలో స్పష్టంగా కనిపిస్తాయి. భక్తియొక్క స్థితి ముదిరే కొద్దీ ఈ గుణాలు ఇంకా అభివృద్ధి చెందుతూ వస్తాయి.

ఎవడు తన కర్తవ్యాలను ఏ కొరత లేకుండా నిర్వహిస్తాడో, గొప్పదైన ఆపదలు ఎదురైనప్పుడు కూడా ఆ కర్తవ్యాలను చేయడంలో తల వెంట్రుక వాసి కూడా మీరకుండ ఉంటాడో, తాను, ఇతరులు, చుట్టాలు మిగిలినవారు, మిత్రులు, శత్రువులు– అనే భేదభావం లేకుండా అందరి విషయంలోనూ ఒకే విధంగా నడుచుకుంటాడో, లోపల, బయట ఒకే విధంగా ప్రవర్తిస్తూ ఋజువుగా వర్తిస్తాడో, భగవంతుని విషయంలో మనసు నిండిన ప్రేమను కలిగినవాడై ఉంటాడో, అతడే నిజమైన భక్తుడు. పాలను, నీటిని వేరు చేయగలిగిన హంసవలె, అటువంటి భక్తులను అనాయాసంగా పెద్దలు గుర్తిస్తారు.

శ్రీవిష్ణుపురాణంలో మూడవ అంశలో ఏడవ అధ్యాయంలో యమకింకర సంవాదంలో మహా భక్తుల లక్షణాన్ని యముడు తన

కింకరులకు చాలా విశదంగా చెప్పడం మనకు గోచరిస్తుంది. అక్కడ ఉండే పలు శ్లోకాలలో, ఒక శ్లోకం మాత్రమే ఇక్కడ ప్రస్తావింపబడుతున్నది.

న చలతి నిజవర్ణధర్మతో యః
సమమతి రాత్మసుహృద్విపక్షపక్షే,
న హరతి న చ హంతి కించిదుచ్చైః
సితమనసం తమవేహి విష్ణుభక్తమ్.

ఈ శ్లోకం తప్పక కంఠస్థం చేయవలసిన శ్లోకం.

# కూరేశుల తనియన్ శ్లోకంలోని గొప్పతనం

(శ్రీప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారి ద్రావిడవ్యాసానికి అనువాదం)

మన పూర్వాచార్యులు అందరికీ తనియన్ శ్లోకాలు ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా అవతరించాయి. శ్రీకూరేశులకు తనియన్ అవతరించిన విధం నిజానికి చాలా విలక్షణమైనది. ఈ శ్లోకం వారి కుమారులైన పరాశర భట్టర్ అనుగ్రహించినందున, వారి విలక్షణమైన వాక్చాతుర్యం ఇందులో విజృంభించి వెలుగుతున్నది. " "యదుక్తయః త్రయీ కంఠే యాంతి మంగళసూత్రతామ్" అనేది కూరేశుల తనియన్ శ్లోకంలో రెండవ భాగం. కురేశుల శ్రీసూక్తులు వేదం అనే కాంత కంఠంలో మంగళసూత్రంగా వెలుగుతున్నాయి– అని చాలా చమత్కారంగా ఇందులో చెప్పబడింది. ఈ సూక్తిలోని సౌందర్యాన్ని కొంచెం అనుభవిద్దాం.

లోకంలో స్త్రీలకు కంఠంలో మంగళసూత్రం లేని దశలు రెండు. అందులో, కన్యకాదశ ఒకటి. భర్త గతించినప్పుడు విధవ అయిన దశ రెండవది. వీటిలో, కన్యకాదశలోని స్త్రీని పలువురు నాయకులు తమకు ఆమె పత్ని కావాలని కోరే దశ ఉండవచ్చు. ఎందుకంటే, స్త్రీకంఠంలో ఉండవలసిన మంగళసూత్రం ధరించే వరకు పలువురు బ్రహ్మచారులు, విధురులు ఆమెను తమకు భార్యగా భావించే అవకాశం ఉన్నది. "ఈ స్త్రీకి నేనే నాథుడను కావాలి" అని స్వరూపయోగ్యత కలిగినవారు అందరూ భావించే అవకాశం ఉన్నది కదా. అంతేకాక, విరక్తులు, గృహస్థులు కూడా "ఈ కన్యకకు ఇంకా భర్త నిశ్చయింపబడలేదు" అని సాధారణంగా

భావిస్తారు. ఆ కన్యక కంఠంలో తాళి కట్టబడిన తరువాత, అంతవరకు ఈమె తమకు కావాలి అని అభిమానించిన బ్రహ్మచారులు, విధురులు కూడా "ఇక ఈమె అనన్యార్హ" అని నిశ్చయించుకొని, ఆమెపై తాము ఆశపడడం మానివేస్తారు. ఆమె విషయంలో సాధారణంగా భావించిన మిగిలిన గృహస్థులు, విధురులు కూడా "ఈమెకు ఒక భర్త ఏర్పడ్డాడు" అని భావిస్తారు.

ఇక, రెండవది అయిన వైధవ్య దశలో, ఆ స్త్రీని చూసేవారు, "ఈమెకు ముందు ఏర్పడిన భర్త ఇప్పుడు లేకుండా పోయాడు. ఇక, ఈమెకు ఏనాడూ భర్త ఏర్పడే అవకాశం లేదు" అని తలుస్తారు. అందుచేత, స్త్రీలకు మంగళసూత్రం లేని స్థితులలో, పలువురు ఆమెకు భర్తగా భావించే స్థితి, ఏ భర్త లేని స్థితి– అని రెండు స్థితులు ఉంటాయి.

ఆ విధంగానే, కూరేశుల శ్రీసూక్తులు. అవతరించటానికి ముందు, వేదకాంత మంగళసూత్రం లేని స్త్రీలవలె, రెండు విధాలైన స్థితులను కలిగినది అయినది. వేదానికి రుద్రుని పతిగా కొందరు భ్రమించి అభిమానించారు. బ్రహ్మను పతిగా మరి కొందరు భావించారు. ఇంకా, పాశుపతులు మొదలైన మతాంతరులు పలు పలు దైవాలను పతిగా అభిమానించడం జరిగింది. ఆ విధంగానే, నిరీశ్వర మీమాంసకులు మొదలైనవారు వేదానికి నాయకుడే లేడని భావించడం జరిగింది. కూరేశుల పంచస్తవి మొదలైన దివ్యసూక్తులు అవతరించిన వెంటనే, శిరస్సును ఖండించినవాడు కాని (శివుడు), శిరస్సును ఖండింపబడినవాడు కాని (బ్రహ్మ), ఇంకా మరి ఏ దైవం కాని, వేదానికి

నాయకుడు కాడు. పూర్తిగా నాయకుడే లేడని అనడం కూడా తగదు, నాయకుడు ఉన్నాడు, అతడు ఒక్కడే, అతడు శ్రీమన్నారాయణడే –అని శిలాశాసనంగా నిర్ణయింపబడినందున, వీరి శ్రీసూక్తులు వేదకాంతకు మంగళసూత్రంవంటివి అయినవి. ఇందువల్ల, సకలదుర్మతాలను నిరసించి, పరతత్వ నిర్ణయం చేయగలిగిన వాగ్వైభవాన్ని కలవారు, కురేశులు– అని చెప్పినట్లు అయినది. వస్తుస్థితిలో శ్రీభాష్యాదులు. అవతరించినప్పటికీకూడా, కూరేశుల పంచస్తవి అవతరించి ఉండకపోతే, మన భగవద్రామానుజదర్శనానికి అపరిహార్యమైన కొరత ఏర్పడి ఉండేది కదా.

వడివఴకియనంబిదాసర్ రచించిన శ్రీరామానుజవైభవం గ్రంథంలో

# శ్రీనాథమునుల వైభవమ్

★★★★★

## నాథమునుల అవతారం

*1) అరుళ్ తరుమ్ శీర్ తమిఴ్ వేదమ్ ఎన త్తోన్ఱి అకలిడత్తిల్*

*ఇరుళ్ ముఴుదుమ్ తురంద్దోట్టి ఎఴున్దిలంగు మాదవనై*

*మారుళూరుమ్ పొయ్ కలి మేగమ్ వందు మఱైందిడ వైయమ్*

*తెరుళురు శీర్ నెఱి పిఴ్హత్తు తీనెఱిక్కణ్ శెలునాళిల్*

మిక్కిలి తేజస్సుతో ప్రకాశించే లక్ష్మీనాథుని అజ్ఞానాన్ని కలిగించే అసత్యం, దుఃఖం మొదలైన మేఘాలు ఆవరించగా, లోకానికి ఉజ్జీవనాన్ని కలిగించే, గొప్పతనాన్ని నిండుగా కలిగిన సన్మార్గంనుండి తప్పి జనులు చెడ్డ మార్గంలో ప్రవర్తించే సమయంలో, దయను చూపే గొప్పతనాన్ని కలిగిన ద్రావిడ వేదం అనే దివ్యప్రబంధాన్ని ఆవిర్భవింప చేసి, లోకంలో ఉండే అజ్ఞానం అనే చీకటిని అంతటినీ పారదోలే రీతిలో.

*2) నీది వళర్ మకిఴ్మాఱన్ తిరువరుళాల్ నీణిలత్తిల్*

*వేదియర్ కళ్ పలర్ వాఴుమ్ వీరనారాయణత్తిల్*

*శోది మఱై యవర్ మరపిల్ శొట్టైక్కులత్తవరిల్*

*ఓదియ శీర్ ఈచ్చుర పట్టాఴ్వార్ వందుఅప్పవిత్తార్*

సన్మార్గాన్ని వృద్ధి చేసే నమ్మాళ్వారుల అనుగ్రహంచేత విశాలమైన ఈ భూలోకంలో బ్రాహ్మణులు పలువురు నివసించే

వీరనారాయణపురంలో జ్ఞానం గొప్పగా ప్రకాశించే బ్రాహ్మణ కులంలో శొట్టై వంశంలో ఈశ్వర భట్టాళ్వార్ అనేవారు ఆవిర్భవించారు.

*3) శీతమికుమ్ తుழாయ్ ముడియాన్ తిరువరుళాల్ ఉలగుయ్య*
*వేదమరుమ్ తమిழ் శెయ్ దాన్ మెయ్ విళంగ ప్పొయ్ కలంగ*
*పోదమిగు ఈచ్చురపట్టాழ்వార్ క్కు ప్పుతలత్తిల్*
*నాదముని ఎన ఒరువన్ పిఱందనన్ నాన్మఱై వాழ*

మిక్కిలి చల్లదనాన్ని కలిగిన తులసీమాలను అలంకరించుకున్న లక్ష్మీనాథుని అనుగ్రహంతో లోకం ఉజ్జీవనం పొందేటట్లుగా నాలుగు వేదాలను అరుదైన నాలుగు దివ్యప్రబంధాలుగా అనుగ్రహించినవారైన నమ్మాళ్వారుల తత్వాలు ప్రకాశించడంకోసం, అసత్యమైన అర్థాలు భయపడి పరుగెత్తడం కోసం, నాలుగు వేదాలు ప్రకాశించడం కోసం జ్ఞానం మిక్కిలిగా కలిగిన ఈశ్వర భట్టారకులకు నాథముని అనే ఒక పుత్రుడు ఉదయించారు.

*4) ఆంగవన్ పిఱందిమ్మణ్ణిల్ ఆరుయిర్ ఉయ్యచ్చెయ్ ద*
*ఓంగు శీర్ ఉదవి తన్నై ఉఱు ఎనాల్ ఉరైక్కలామే!*
*తాంగు నల్గుణత్తినర్ క్కోర్ దాశన్ నాన్ ఆదలాల్*
*ప్పాంగినాల్ నారణైయన్ పణిత్త వా పకరల్ ఉఱ్ఱేన్*

వీరనారాయణపురంలో నాథముని అవతరించి, జీవులు అందరు ఉజ్జీవనాన్ని పొందేటట్లు చేసిన గొప్ప ఉపకారాలనుగూర్చి నాకు పలకడం సాధ్యమా! సద్గుణాలు కలిగిన సత్పురుషులకు దాసుడను నేను కనుక,

ఆ స్వభావంతో శ్రీమన్నారాయణుడు నాకు స్ఫురింప చేసినట్లుగా చెప్పడానికి ప్రయత్నిస్తున్నాను.

*5) మిన్నుసైయ తిరువరుళుమ్ వీరనారాయణత్తిల్*
*మన్ను నార్ తిరువరుళుమ్ మాశిలా ప్పాలకనుక్కు*
*ఇన్నుముదమాగ ఇరు మూన్ఱు తింగళ్ తనిల్*
*అన్నప్పిరాశనమ్ శెయ్ దప్పరువమ్ శెన్దదన్ పిన్*

వీరనారాయణపురంలో ఉండే, మెఱుపువంటి కాంతిని కల లక్ష్మీదేవి అనుగ్రహాన్ని, మన్ననార్ (ఆ ఊరిలో ఉండే భగవానుని) అనుగ్రహాన్ని సహాయంగా చేసికొని, ఏ దోషం లేని నాథమునులు అనే ఆ బిడ్డకు ఆరవ మాసంలో అన్నప్రాశన సంస్కారాన్ని చేయించారు. ఆ పరువం దాటిన తరువాత,

*6) ఇలంగు నాన్మఱైయిల్ మున్నమ్ ఇశైత్తవా చవుళమ్ శెయ్ దు*
*వలంపురి మున్నూల్ శాత్తి మాశఱు మఱైకళ్ ఓది*
*అలంగలుమ్ తారినాలుమ్ ఆశఱు మరపిల్ ఆంగోర్*
*శిలంబణి పదత్తినాళై త్తిరుక్కలియాణమ్ శెయ్ దాన్*

నాథమునులకు, నాలుగు వేదాలలో చెప్పిన క్రమాన్ని అనుసరించి చౌళ సంస్కారాన్ని జరిపించి, ఉపనయన చేయించి, ఏ దోషం లేని వేదాలను అన్నిటిని అధ్యయనం చేసి పూర్తి అయిన తర్వాత, తులసి పూసలమాలను అలంకరించుకున్న ఈశ్వర భట్టారకులు మంచి కులంలో పుట్టిన, పాదమంజీరాలను అలంకరించుకున్న చక్కని కన్యను నాథమునులకు ఇచ్చి కళ్యాణం జరిపించారు.

*7) అంద ఒణ్ తొడిపాల్ నాదమునికళుక్కు అమరర్ పోఱ్ఱ*

*వందోరు పుదల్వన్ తోన్ఱ మఱ్ఱవన్ తనక్కు నామమ్*

*ఇందమా నిలత్తోర్ ఏత్తుమ్ ఈచ్చురమునియెన్ఱిట్టు*

*ముందై నాన్మఱైయిల్ కన్మమ్ మఱ్ఱుమమ్ ముఱైయాల్ శెయ్ దే*

నాథమునులకు ఆ కన్యక వల్ల దేవతలు కీర్తించదగిన రీతిలో ఒక కుమారుడు పుట్టాడు. ఆ బిడ్డకు లోకంలోనివారు పొగడే విధంగా ఈశ్వరముని అని పేరు పెట్టి, ప్రాచీనమైన నాలుగు వేదాలలో చెప్పబడిన సంస్కారాలను అన్నిటిని క్రమానుసారంగా నాథమునులు చేశారు.

*8) వీరనారాయణత్తిల్ మన్ను నార్ విరైత్తాళ్ ఏత్తి*

*చ్చీరుఱు పితావుమ్తాముమ శిఱువనుమ్ శిలనాళ్ అంద*

*కార్ ముకిల్ వణ్ణర్ క్కేఱ్కుమ్ కయిఙ్కరియంగళ్ శెయ్ దాంగు*

*ఆర్వమోడిరుందార్ నాదమునికళ్ మఱ్ఱనాళ్ తన్నిల్*

నాథమునులు వీరనారాయణపురంలో, సువాసన కల మన్ననార్ శ్రీచరణాలను స్తుతించి, గొప్పతనాన్ని కలిగిన తన తండ్రి, తాను, కుమారుడు కలసి కొన్నాళ్ళు ఆ మేఘవర్ణునకు కైంకర్యాలను చేస్తూ, ఆ ఊరిలో అభినివేశంతో ఉన్నారు. ఆ సమయంలో–

## 2) నాథమునుల క్షేత్రయాత్ర

*9) తిరుమకళ్ కొழுనన్ మున్నమ్ తిరువవతారమ్ శెయ్ దు*

*మరువియ ఇడంగళ్ తోఱుమ్ వణంగిడవేండుమ్ ఎన్ఱు*

*పెరుగియ కాదలోడు పిళ్ళైయుమ్ పితావుమ్ తాముమ్*

*ఒరుపగల్ మన్ను నారై త్తొழுదివై ఉరైక్కలుఱ్ఱార్.*

ఒకనాడు, శ్రీమన్నారాయణుడు పూర్వం రామకృష్ణాది అవతారాలను ఎత్తి, నివసించిన క్షేత్రాలను అన్నిటినీ దర్శించి నమస్కరించాలి– అని వృద్ధి చెందిన ఆశతో తమతండ్రి, కుమారుడు, తాము కలసి వీరనారాయణ స్వామిని నమస్కరించి, ఈ విధంగా పలికారు.

*10) నారాయణనే! నీ మున్న మ్ ఞాలముయ్య అవతరిత్త*
*శీరార్ అయోత్తి వడ మదురై తిరువాయ్ ప్పాడి తుడక్కమామ్*
*ఏరార్ పదికళ్ మఱ్ఱుమ్ కెడుత్త కోవర్ త్తనమ్ శిఱంద*
*ఏరార్ నుదలాళ్ కండిఱైంజుమ్ పిరుందావనమ్ మత్తుళ్ తలంగళ్*

శ్రీమన్నారాయణా! లోకం ధరించేటట్లుగా నీవు పూర్వం అవతరించిన అయోధ్య, ఉత్తర మధుర, రేపల్లె మొదలైన గొప్ప దివ్యదేశాలను, వర్షంనుండి కాపాడడం కోసం గొడుగుగా ఎత్తిన, అందమైన గోవర్ధన పర్వతాన్ని, అందమైన నుదురును కల గొప్ప గోపికలు దర్శించి నమస్కరించే బృందావనం మొదలైన క్షేత్రాలను–

*11) పండు నీ పుక్కమర్ న్ద తలమ్ పాదచ్చువడు ఎల్లనైత్తినైయుమ్*
*కండు కణ్ణాళ్ కై కూప్పి కరుత్తిల్ ఇఱైంజి త్తిరుమ్బిడునాస్*
*ఉండు విరప్పమ్ విడై యరుళ్ క ఉలగముండాయ్ ఎన నిన్టార్*
*కొండల్ వణ్ణన్ అవణమ్ శెయ్ దిడుగ ఎన్న విడై కొడుత్తాన్.*

పూర్వకాలంలో నీవు వేంచేసి ఉన్న స్థలాలను, పాదముద్రలను అన్నిటిని కొంచమైనా కళ్ళారా దర్శించి, చేతులారా నమస్కరించి, మనసారా సేవించి తిరిగి రావడానికి మాకు కోరిక ఉన్నది. లోకాలను

అన్నిటినీ కడుపులో పెట్టుకున్నవాడా! మాకు నీ అనుమతిని ఇవ్వాలి" అని ప్రార్థించారు. నీలమేఘశ్యాముడు కూడా "ఆ విధంగానే కానివ్వండి" అని అనుమతిని ఇచ్చాడు.

*12) మన్న నార్ విడై కొడుప్ప మర్రవరై వలమ్ శెయ్ దు*

*మున్నై నాన్ మరై కాణా ముళరి మలరడి పణిందంగు*

*అన్న నా కిళమ్ పెడై--------*

*మిన్న నార్ నడై పయిర్రుమ్ వీరనారాయణత్తై*

ఈ విధంగా మన్ననార్ అనుమతి ఇవ్వగా, ఆ స్వామిని ప్రదక్షణంచేసి, ప్రాచీనమైన నాలుగు వేదాలు అన్వేషించడానికి వీలుకాని ఆ స్వామి శ్రీపాదపద్మాలను నమస్కరించి, హంసలకు నడకలను నేర్పించే అందమైన నడకలను కలిగిన వనితలతో నిండిన వీరనారాయణ పురాన్ని–

*13) విట్టెழுన్దు మూవర్కళుమ్ వేదాంత త్తినిదమరుమ్*

*ఎట్టెழுత్తే తుణైయాక ఏழுలగుమ్ తొழுత్తేత్తుమ్*

*మట్ట విழ் పూమ్ పుడై శూழ் అయోత్తినగర్ వడ మదురై*

*శిట్టర్ తొழுమ్ ఆయ్ ప్పాడి శీవదరికాచ్చిరముమ్.*

ఆ ముగ్గురు వీరనారాయణ పురాన్ని వదిలి బయలుదేరి, వేదాంతంలో అంతరార్థంగా ప్రకాశించే అష్టాక్షరీ మహామంత్రాన్ని శరణంగా గ్రహించి, ఏడు లోకాలు నమస్కరించదగిన, తేనె సేవించే పూలు వికసించే తోటలను చుట్టూ కలిగిన అయోధ్యానగరం, ఉత్తర మధుర, గొప్ప ఆచారాన్ని కలిగినవారు నమస్కరించే రేపల్లె, శ్రీబదరికాశ్రమం–

*14) తుడక్కమాన తిరుప్పతికళ్ శురుది కూఱి నాఱ్ఱిశైయిల్*
*వడక్కిలుళ్ళ తిరుప్పతికళ్ ఎల్లామ్ నోక్కి వణంగియ పిన్*
*కుడక్కుమ్ కుణక్కుమ్ శెన్ఱిఱైంజి క్కోలమిక్క పార్ మకళ్ మేల్*
*కిడక్కుమ్ యమునాతీరత్తిల్ కిడక్కుమ్ కోవర్ త్తనపురత్తిల్*

మొదలైన దివ్యదేశాలను వేదాలను పలికి నమస్కరించి, నాలుగు దిక్కులలోను, ఉత్తరంలో ఉండే క్షేత్రాలను అన్నిటినీ దర్శించి నమస్కరించి, తరువాత, పడమర వైపుకు, తూర్పు వైపుకు వెళ్లి, నమస్కరించి మిక్కిలి అందమైన భూమిలో ఉండే యమునానదీతీరంలో ప్రకాశించే గోవర్ధన పర్వతం ఉండే బృందావనంలో–

*15) మన్నుమ్ యమునైత్తుఱైవనై వణంగి ఇణంగు మూవర్ కళుమ్*
*పిన్ను మిన్ఱి వీడు తోఱుమ్ పిచ్చై పుక్కాంగు అప్పదియిల్*
*మిన్ను నేమి వలత్తాఱ్కు వేండుమ్ పణి శెయ్ దు అండు పల*
*ఇన్నల్ నీంగి అంగుళ్ళార్ యారుమ్ ఇఱైంజ ఇనిదమర్ న్దార్*

వేంచేసి ఉండే యమునానదీ తీరవిహారి అయిన శ్రీకృష్ణుని నమస్కరించి, ఆ ముగ్గురు కూడా, వ్యత్యాసం లేకుండా ప్రతి ఇంటిలోనూ బిక్షను యాచించి భుజిస్తూ, కాలం గడుపుతూ, ఆ క్షేత్రంలో వేంచేసివున్న, ప్రకాశించే చక్రాయుధాన్ని కుడి చేతిలో కలిగిన భగవంతునకు చేయవలసిన సేవలను చేస్తూ, ఆ ఊరిలో ఉండే పలువురు నమస్కరించగా, ఏ చింత లేకుండా పలు సంవత్సరాలు సుఖంగా జీవిస్తూ వచ్చారు.

## ఉభయవేదాలు– పరత్వాది పంచకం

భగవానుడైన శ్రీమన్నారాయణుని స్వరూపం పరవ్యూహవిభవ అంతర్యామి అర్చావతార భేదాలతో ఐదు విధాలుగా ఉంటుందని సంస్కృత ద్రావిడవేదాలలో స్పష్టంగా ప్రతిపాదించబడింది. "మమ ప్రకారాః పంచేతి ప్రాహుః వేదాంతపారగాః, పరో వ్యూహశ్చ విభవో నియంతా సర్వదేహినామ్, అర్చావతారశ్చ తథా దయాళుః పురుషాకృతిః, ఇత్యేవం పంచధా ప్రాహుః తేవేదాంతవిదో జనాః" (నా రూపాలు పరం, వ్యూహం, విభవం, జీవాత్మలను అన్నిటినీ నియమించే అంతర్యామి, అంతేకాకుండా, దయాస్వభావాన్ని, పురుషరూపాన్ని కలదైన అర్చారూపం– అని ఐదు విధాలుగా అని వేదాంత విదులు పలుకుతారు) అని విష్వక్సేన సంహితలో భగవంతుడే స్వయంగా తన పరత్వాది పంచకాన్నిగూర్చి చెప్పాడు. ఈ విషయం సంస్కృతవేదంలో ద్రావిడవేదంలో ప్రతిపాదింపబడిన విషయాన్ని స్థాలీపులాక న్యాయంలో కొంచెం గమనిద్దాం.

పరం అంటే, పరమపదంలోని రూపం. వ్యూహం అంటే, పాలసముద్రంలో ఆదిశేషునిపైన శయనించి ఉండే రూపం. విభవం రామకృష్ణాది అవతారాలు. జీవుని హృదయంలో ఆదివసించి ఉండి, వారిని నియమించే రూపం, అంతర్యామి. దివ్యక్షేత్రాలలో విగ్రహాదిరూపాలలో వేంచేసి ఉండేది అర్చారూపం.

"అంభస్య పారే, భువనస్య మధ్యే, నాకస్య పృష్ఠే, మహతో మహీయాన్, " అనే సంస్కృత వేదవాక్యంలో "అంభస్య పారే" అని

అనడం చేత క్షీరాబ్ధిలోని వ్యూహరూపం, "భువనస్య మధ్యే" అని అనడం వల్ల భూమిపై సంచరించే రామకృష్ణాది అవతార రూపాలైన విభవం, అర్చ, "నాకస్య పృష్ఠే"అని అనడం చేత పరమపదం చెప్పబడ్డాయని మన ఆచార్యుల అభిప్రాయం.

నమ్మాళ్వారుల తిరువిరుత్త ప్రబంధంలోని "వండుగళో" అనే 55వ పాశురాన్ని వ్యాఖ్యానిస్తూ నంబిళ్ళై, పెరియ వాచ్చాన్ పిళ్లై అనే ఆచార్యులు ఈ శ్రుతి వాక్యాన్ని ఉదాహరించారు. దీనిని వివరించే అరుంబదకారులు " అంభస్య పారే– ఎన్టు వ్యూహత్తై చ్చొల్లుకిఱదు. భువన మధ్యే– ఎన్టు విభవత్తైయుమ్, అర్చైయైయుమ్ శొల్లుకిఱదు. నాకస్య పృష్ఠే– ఎన్టు పరత్వత్తై చ్చొల్లుగిఱదు" (అంభస్య పారే– అని వ్యూహం చెప్పబడుతున్నది. భువనస్య మధ్యే– అని విభవరూపం, అర్చారూపం చెప్పబడుతున్నవి. "నాకస్య పృష్ఠే" అని పరం చెప్పబడుతున్నది) అని అనడం దీనికి ఒక ఉదాహరణం. పై శ్రుతివాక్యంలో అంతర్యామి రూపం లేదుకదా! అనే సందేహం కలుగవచ్చు. కానీ, ఈ వాక్యంలో తెలుపబడిన పరత్వాది నాలుగు రూపాలు మిగిలిన అంతర్యామి రూపానికి ఉపలక్షణం అని చెప్పవచ్చు. లేదా, ఆ వాక్యంలో తరువాత ఉండే " ప్రజాపతిః చరతి గర్భే అంతః" అనే ప్రయోగం అంతర్యామి రూపాన్ని చెబుతున్నదని కూడా అనుకోవచ్చు.

ఇంతేకాక, పరత్వాది పంచకాన్ని పూర్తిగా సూచించే వేదవాక్యాలు కూడా లేకపోలేదు. అటువంటి శ్రుతులలో ఒకటి, కఠవల్లికి చెందినదిగా చెప్పబడే "ఇదం పూర్ణ మదః పూర్ణం పూర్ణా పూర్ణ ముద్రిచ్యతే, పూర్ణస్య

పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే" అనే శ్రుతివాక్యం. అణ్ణా అప్పంగార్ గా ప్రసిద్ధులైన శ్రీవాధూల వీరరాఘువాచార్యస్వామివారు శ్రీవచనభూషణ వ్యాఖ్యానారుంబదంలో ఈ శ్రుతి ఏ విధంగా పరత్వాది పంచకాన్ని తెలుపుతున్నదో వివరించారు. ఆ వివరణమేమో కొంచెం గమనిద్దాం.

ఇక్కడ, "యదేవేహ తదముత్ర" అనే సందర్భంలోవలె "ఇదం, అదః" శబ్దాలు వరుసగా అంతర్యామి, పరరూపాలను తెలుపుతున్నాయి. ఇదం– ఈ అంతర్యామి రూపం, పూర్ణం– కళ్యాణ గుణాలతో నిండినది, అదః– నిత్యవిభూతి అయిన లోకాంతరంలో ఉండే ఆ పర రూపం, పూర్ణం– కళ్యాణ గుణాలతో పూర్ణమైనది, పూర్ణాత్– షాడ్గుణ్యపూర్ణమైన పరరూపం నుండి అభివ్యక్తమైన, పూర్ణం– వ్యూహ రూపం, ఉద్రిచ్యతే– రెండు, రెండు గుణాలతో, అంటే, జ్ఞానం– బలం, ఐశ్వర్యం– వీర్యం, శక్తి –తేజస్సు అనే రెండు రెండు గుణాలతో బహువిధాలు అవుతున్నది. పూర్ణస్య– అవతారకందమైన క్షీరాబ్ధిశాయి అయిన వ్యూహవిశేష నుండి ప్రాదుర్భవించినది అయినందువల్ల, పూర్ణం– కళ్యాణగుణ పూర్ణమైన విభవరూపాన్ని, ఆదాయ– తనకు హేతువుగా, మూలంగా స్వీకరించి, పూర్ణమ్ ఏవ –కళ్యాణగుణపూర్ణమైన అర్చావతారమే, అవశిష్యతే– నిత్యం ఆశ్రయించదగినది అవడం చేత, నిత్యసన్నిహితమై, సౌలభ్యం మొదలైన గుణాల పూర్తికి పర్యవసానభూమియై, పరద్వాదులతో నిలచి ఉన్నది.

వాధూల వీరరాఘువచార్యస్వామివారు చేసిన ఈ వివరణాన్ని బట్టి పూర్వం ఉదాహరించిన "ఇదం పూర్ణమ్" అని మొదలవుతున్న కఠవల్లీ

ప్రమాణంలో పరద్వాది పంచకం సూచితం అని స్పష్టంగా తెలుస్తున్నది కదా. ఇంతే కాక, ఒక్కొక్క రూపాన్ని తెలియజేసే సంస్కృతశ్రుతిప్రమాణాలుకూడా అనేకం ఉన్నాయి.

ద్రావిడవేదం అనబడే ఆళ్వారుల దివ్యప్రబంధాలలో కూడా పలుచోట్ల ఈ పరత్వాది పంచకాన్ని తెలియజేసే సూక్తులు ఉన్నాయి. నమ్మాళ్వారులు అనుగ్రహించిన తిరువాయ్ మొళి ప్రబంధంలోని "విణ్ మీదిరుప్పాయ్, మలైమేల్ నిఱ్పాయ్, కడల్ శేర్ ప్పాయ్, మణ్ మీదు ఉ*ழ*ల్వాయ్, ఇవ*ற்று*ళ్ ఎంగుమ్ మఱైందుఱైవాయ్" (6–9–5) (పరమపదంలో ఉంటావు, వేంకటాచలంపై నిలచి ఉంటావు, సముద్రంలో చేరి ఉంటావు, ఈ భూమిపై సంచరిస్తావు, ఈ జీవులలో అంతటా అంతర్యామి రూపంలో గుప్తంగా ఉంటావు) అనే సూక్తిలో ఈ భరద్వాది పంచకం సూచింపబడింది. ఏ విధంగా అంటే, " విణ్ మీదిరుప్పాయ్" అని అనడంచేత పరమపదంలోని పరరూపం, "మలై మేల్ నిఱ్పాయ్" అని అనడంచేత వేంకటాచలంపై నిలచి ఉండే సన్నివేశంలో ప్రకాశించే అర్చారూపం, "కడల్ శేర్ ప్పాయ్" అని అనడంచేత పాలసముద్రంలో ఆదిశేషునిపై శయనించి ఉండే వ్యూహరూపం, " మణ్ మీదు ఉ*ழ*ల్వాయ్" అని అనడం ద్వారా భూమిపై సంచరించే రామకృష్ణాది విభవరూపాలు, "ఇవ*ற்று*ళ్ ఎంగుమ్ మఱైందుఱైవాయ్" అని అనడంచేత జీవులందరికీ ఉంటూ, బాహ్యనేత్రాలకు కనిపించకుండా ఉండే అంతర్యామిరూపం సూచింపబడ్డాయి. ఈ విధంగా ఈ సూక్తిలో ఐదు రూపాలు ప్రస్తావింపబడడం స్పష్టం.

ఈ సందర్భంగా ఇంకొక ద్రావిడవేద ప్రమాణాన్ని కూడా గమనిద్దాం. నమ్మాళ్వారుల తిరువిరుత్తప్రబంధంలో " నీర్పూ నిలప్పూ మరత్తిలొణ్ పూ" (55) అనే ప్రయోగంలో పూర్వం ఉదాహరింపబడిన "అంభస్య పారే" అని మొదలైన సంస్కృత వేదవాక్యక్రమంలో నాలుగు విధాలయిన భగవానుని రూపాలు తెలుపబడుతున్నాయని వ్యాఖ్యాతల అభిప్రాయం.

ఈ సూక్తిని నంబిళ్ళై ఈ వ్యాఖ్యనిస్తూ–" ఈ సూక్తి మూడు విధాలుగా కానీ, నాలుగు విధాలుగా కానీ చెప్పబడుతున్నది కదా" అని అంటూ, " నిలా ప్పూవుమ్, కొడి ప్పూవుమ్ నిలత్తిలై ఇరండాక్కి, మత్తై ఇరండైయుమ్ కూట్టి, నాలాగ చ్చొల్లువారు ముండు" అని వ్యాఖ్యానించడం ఇక్కడ గమనించాలి. "నీర్ ప్పూ" (నీటిలో పువ్వు) అని అనడం చేత వ్యూహం, "నిలప్పూ" (భూమిపై పువ్వు) అని అనడంచేత విభవ, అర్చామూర్తులు, "మరత్తిల్ ఒణ్ పూ" అని అనడం చేత ఉన్నత స్థానంలో ఉండే పరమపదం, ఈ విధంగా నాలుగు ప్రకారాలు ప్రస్తుతింపబడ్డాయి. ఈ విధంగానే, ద్రావిడ ప్రబంధాలలో ఇంకా ఎన్నో ఇటువంటి ప్రమాణాలు గోచరిస్తాయి. విస్తరబీతి వల్ల ప్రస్తావించడం లేదు.

సంస్కృత వేదంలో, ద్రావిడ వేదంలో సమానంగా ప్రస్తావింపబడిన ఈ అంశం ఒక మధురమైన, ఉభయవేదాంతైకకంఠ్యాన్ని తెలిపే అంశం.

# భగవంతుడు ఎక్కడ ఉన్నాడు?

(కాంచీ ప్రతివాది భయంకరమ్ శ్రీ అణ్ణంగరాచార్యస్వామివారి ద్రావిడవ్యాసానికి ఆంధ్రానువాదం)

చిన్న పిల్లలు విద్యాలయానికి వెళ్ళడానికి ఆరంభించేటప్పుడు, ఒకరితో ఒకరు సంభాషించుకోవడంలో, పలు వినోదాత్మకమైన సంభాషణలు సంభవించవచ్చు. అటువంటి సంభాషణలలో ఒక విధమైన సంభాషణ ఏమి అంటే, రామునితో కృష్ణుడు "రామా! భగవంతుడు ఉండే చోటను నీవు చెప్పేటట్లయితే, నీకు ఒక అణా ఇస్తాను" అని అన్నాడు. దానికి సమాధానంగా రాముడు "కృష్ణా భగవంతుడు లేని చోట ఏదో నీవు నాకు చూపిస్తే, మీకు రెండు అణాలు ఇస్తాను" అని అన్నాడు. ఈ సంభాషణ వల్ల ఏమి తేలుతున్నదంటే, భగవంతుడు అంతటా వ్యాపించి ఉండే పరతత్వం అనే జ్ఞానమే. ఈ జ్ఞానం చిన్నతనం నుండే మన పిల్లలకు మనస్సులో ఏర్పడినట్లు దీనివల్ల మనకు తెలుస్తున్నది. "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అని వేదాంత పరిచయం కలిగిన తరువాత పెద్దలకు కలిగే జ్ఞానం చిన్నపిల్లలకు కలుగుతున్నదంటే, దీనికి కారణం ఉన్నత వంశంలో పుట్టడమే అని చెప్పాలి. ఉన్నతకులంలో జన్మ అనేది బహు సుకృత ఫలాలలో ముఖ్యమైనది. ఉన్నత కులంలో పుట్టినవారికి ఆస్తిక్యం మొదలైన గొప్ప గుణాలు సహజంగానే కలుగుతాయి. "భగవంతుడు అంతటా ఉన్నాడు" అనే జ్ఞానం పూర్వకాలంలో ప్రహ్లాదునకు కలిగినట్లు ఇతిహాస పురాణాల వల్ల గ్రహిస్తున్నాం. ఈ జ్ఞానం ఆస్తిక కుటుంబాలలో ఒక్కొక్క కుర్రవానికి

కలుగుతున్నట్లుగా కూడా చూస్తున్నాము. చిన్నతనంలో ఉండే జ్ఞానం ఇంకా ఇంకా వృద్ధి కావలసి ఉండగా, ఈ కాలంలోనివారికి వయసు ముదిరే కొద్దీ, చిన్నతనంలో ఉండే జ్ఞానానికి విపరీతంగా ఉండే జ్ఞానమే కలుగుతున్నట్లుగా కనిపిస్తున్నది. "భగవంతుడు ఎక్కడ ఉన్నాడు?" అనే దానికి ఎదురుగా, "భగవంతుడు ఎక్కడా లేడు, నిజానికి భగవంతుడనేవాడే లేడు" అనే ప్రచారమే ఎక్కువగా కనిపిస్తున్నది.

"భగవంతుడు అంతటా వ్యాపించి ఉన్న వాడైతే, ఆలయాలకు వెళ్లి సేవించడం ఎందుకు? ప్రహ్లాదుడు ఏ కోవెలకు పోయాడు? "అని ఈ విధంగా ప్రశ్నలు అడగడానికి ముందుకు వస్తున్నారు, నవనాగరికులు. మరి, గాలి అనేది అంతటా వ్యాపించి ఉండే తత్వమై ఉండగా, దానికోసం విసనకర్రను వెతుక్కోవడం ఎందుకు? వేలాది రూపాయలను వెచ్చించి కరెంటుతో పని చేసే పంకాలను బిగించుకోవడం ఎందుకు? అని వారిని తిరిగి ప్రశ్నించవలసి ఉన్నది.

"అగ్నౌ తిష్టతి విప్రాణాం హృది తిష్ఠతి యోగినామ్, ప్రతిమాస్వప్రబుద్ధానాం సర్వత్ర సమదర్శినామ్" అని అన్నారు, మహర్షులు. ఈ శ్లోకంలోని అర్థం ఏమంటే– భగవంతుడు, బ్రాహ్మణులకు అగ్నిలో ఉన్నాడు, యోగులకు హృదయంలో ఉన్నాడు, జ్ఞానం లేనివారికి విగ్రహాలలో ఉన్నాడు, అంతటా సమంగాదర్శించే వారికి అంతటా ఉన్నాడు– అని ఈ శ్లోకంలోని తాత్పర్యం.

బ్రాహ్మణులకు భగవంతుడు అగ్నిలో ఉన్నాడు– అని అంటే ఏమి అభిప్రాయం? "కుళిత్తు మూన్టలై యోంబుమ్ కుటికొళ్ అందణమై" అని

అంటూ తొండరడి ప్పొడి అళ్వార్లు పలికినట్లుగా, బ్రాహ్మణుల తమ జాతికి తగినది అయిన నిత్యకర్మానుష్ఠానంలో నిరతులై ఉన్నందున, "వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్, విష్ణు రారాధ్యతే పంథా నాన్య స్తత్తోషకారకః" అని చెప్పబడిన భగవదారాధన నిరతులై ఉన్నందున, దాని మూలంగా భగవంతుని దర్శనం వారికి లభిస్తుంది –అని భావం.

"యోగులకు హృదయంలో ఉంటాడు" అని అంటే, " మార్వ మెన్బదోర్ కోయిలమైత్తు మాదవన్ ఎన్బదోర్ దైవత్తై నాట్టి, ఆర్వమెన్బదోర్ పూవిడవల్లవర్ క్కు" అని పెరియాళ్వార్లు అన్న రీతిలో, జితేంద్రియులై ధ్యానం చేసేవారికి ఆ ధ్యానం మూలంగా భగవంతుని దర్శనం లభిస్తుంది– అని భావం.

అప్రబుద్ధులకు ప్రతిమలలో భగవద్దర్శనం కలగడం అంటే, అర్చారూపాలలో అభినివేశాన్ని పొంది, " ఉలగమ్ ఏత్తుమ్ కండియూర్ అరంగమ్ మెయ్యమ్ కచ్చి పేర్ మల్లై ఎన్టు మండినార్ ఉయ్యలల్లాల్, మఱ్ఱైయార్ క్కు ఉయ్యలామే?" అని తిరుమంగై ఆళ్వారుల సూక్తిలో గట్టి నమ్మకాన్ని కలిగి, దివ్యదేశ ప్రావణ్యమే కాలక్షేపంగా ఉండేవారికి దాని మూలంగా భగవంతుని సులభంగా లభిస్తుంది– అని భావం.

ప్రబుద్ధులకు, అప్రమత్తులకు అనే తేడా లేకుండా, అందరికీ అర్చారూపమే రక్షకంగా ఉండగా, "ప్రతిమాసు అప్రబుద్ధానామ్" అని అనడం ఏమి? ప్రతిమలలో అభినివేశాన్ని పొందిన ఆళ్వార్లు, నాథమునులు, శ్రీరామానుజులు మొదలైనవారైన పూర్వాచార్యుల కూడా

అప్రబుద్ధులేనా? అనే ప్రశ్న కలుగుతుంది. దీనిని గూర్చి పూర్వాచార్య శ్రీసూక్తి ఒకటి ఉన్నది. దానిని గూర్చి తరువాత ప్రస్తావిస్తాను.

ఇక, చివరలో "సర్వత్ర సమదర్శినామ్" అని ఉన్నది. అగ్నికార్యం చేయవలసిన అక్కర లేకుండా, హృదయంలో ధ్యానం చేయవలసిన అవసరం లేకుండా, అర్చలో అభినివేశాన్ని పొందడం కూడా అక్కర లేకుండా, ప్రహ్లాదుడు మొదలైనవారికి అంతటా భగవంతుని దర్శనం లభిస్తుంది –అని భావం.

# ముముక్షుప్పడి గొప్పతనం

(కాంచీ ప్రతివాదిభయంకరమ్ శ్రీ అణ్ణంగరాచార్యస్వామివారి ద్రావిడవ్యాసానికి అనువాదం)

మాటి మాటి అనేక జన్మలను ఎత్తి, జన్మసాగరంలో అల్లాడుతున్న మనవంటివారు మోక్షాన్ని పొందడానికి తప్పక తెలుసుకోవలసిన విషయాలు అనేకం ఉన్నాయి. వాటిలో అర్థపంచక జ్ఞానం చాలా ముఖ్యమైనది. పరబ్రహ్మ స్వరూపం జ్ఞానం, జీవాత్మ స్వరూప జ్ఞానం, ఉపాయ స్వరూప జ్ఞానం, పురుషార్థ స్వరూప జ్ఞానం, విరోధిస్వరూప జ్ఞానం అనే ఈ ఐదు విషయాలకు సంబంధించిన జ్ఞానమే అర్థపంచక జ్ఞానం అని అనబడుతుంది.

ఈ అర్థపంచక జ్ఞానాన్ని తిరుమంత్రం, ద్వయమంత్రం, చరమశ్లోకం అనే మూడు రహస్యాలు చాలా విశదంగా తెలుపుతున్నందున, ముముక్షువులకు ఈ రహస్య త్రయమే ముఖ్యంగా తెలిసికోదగినవి అవుతున్నాయి.

ఈ రహస్యత్రయం అవతరించిన క్రమం ఏమి అంటే, పెరియ తిరుమంత్రం అని, మూల మంత్రం అని చెప్పబడే అష్టాక్షరీ మహా మంత్రం బదరికాశ్రమంలో అవతరించింది. దీనిని నారాయణమూర్తి నరునకు ఉపదేశించినట్లుగా చెప్పబడుతున్నది. వేరొక మంత్రమైన ద్వయం శ్రీ విష్ణు లోకంలో లక్ష్మీదేవి కోసం వ్యక్తం చేయబడింది అని చెప్పబడుతున్నది. చరమ శ్లోకం అనేది భగవద్గీతలో చేరినది అయినందున, అర్జునుని రథం తొట్టిలో శ్రీకృష్ణ భగవానుడు ఆ

అర్జునునకు ఉపదేశించినపుడు అవతరించినది. అందుచేత, ఈ మూడు రహస్యాలకు ప్రవర్తకుడు సర్వేశ్వరుడే. ఈ కారణం చేతనే ఆచార్యపరంపరలో మొదటి స్థానం సర్వేశ్వరునిదే అయినది. "లక్ష్మీనాథ సమారంభాం –––వందే గురుపరంపరామ్" అని అంటూ కూరేశులు అనుగ్రహించడం కూడా ఈ కారణం వల్లనే.

ఈ విధంగా మహా దయాళువు అయిన సర్వేశ్వరుని చేతనే ఈ లోకంలో ప్రవర్తింప చేయబడిన ఈ రహస్యత్రయం శబ్దరూపంలో చాలా సంగ్రహంగా ఉన్నప్పటికీ, చాలా గంభీరమైన, అరుదైన అర్థాలను కలిగినది అయినందున, సకల శాస్త్ర ప్రవీణులైన మన పూర్వాచార్యులు ఇందులో ప్రవేశించి, దీని అర్థ విశేషాలను అన్నిటిని మనకు అరుదైన ఔషధంగా ఉపదేశిస్తూ వస్తున్నారు.

భగవద్రామానుజులకు ముందున్న పూర్వాచార్యులు ఈ రహస్య త్రయార్థాలను చాలా భద్రంగా రక్షించి, చాలా రహస్యంగా ఏకాంతంలోనే ఉపదేశిస్తూ వచ్చారు. ఈ విధంగా ఉండగా, శ్రీరామానుజులు తమ విశాలమైన మనస్సుతో సంసారులందరి విషయంలో దయను కలవారై, ఆ నియమాన్ని దాటి, తాము ఆశ కలిగిన వారందరికీ ఉపదేశించి, తమ శిష్యుల ద్వారా ఉపదేశింపజేస్తూ వచ్చారు. ఈ విషయంలో "ఓరాణ్ వழియాయ్ ఉపదేశిత్తార్ మున్నోర్, ఏరార్ ఎతిరాశర్ ఇన్నరుళాల్, పారులకిల్ ఆశైయుడైయోర్ క్కెల్లామ్ ఆరియర్ కాళ్ కూఋమ్ ఎన్రు పేశి వరంబఋుత్తార్ పిన్" అనే శ్రీవరవరమునుల ఉపదేశరత్తినమాలై పాశురాన్ని స్మరించాలి.

భగవద్రామానుజుల కాలం నుండి ఆరంభించి సంప్రదాయ విశేషార్థాలు విరివిగా ఉపదేశింపబడినప్పటికీ, రహస్యత్రయంలోని అర్థ విశేషాలను శ్రీరామానుజుల కాలంలో గ్రంథస్థం చేసినవారు ఎవరు లేరు అనే చెప్పవలసి ఉన్నది.

రహస్య త్రయవ్యాఖ్యానంగా కూరేశులు ఒక గ్రంథం అనుగ్రహించినట్లు ఊహించే అవకాశం ఉన్నది. వేదాంతదేశికులు అనుగ్రహించిన శ్రీమద్రహస్య త్రయసార గ్రంథంలో చరమ శ్లోకాధికారంలో " ఆழ்వానుడైయ చరమ శ్లోక వ్యాఖ్యానత్తిలుమ్ ఇవ్వాళవే వివక్షితమాకైయాల్ ఒరు విరోధముమ్ ఇల్లై" అనే ఒక సూక్తి కనపడుతున్నందున, కూరేశులు ఒక రహస్య వ్యాఖ్యానాన్ని అనుగ్రహించినట్లుగా తెలుస్తున్నది కదా. అయితే, ఆ గ్రంథం లుప్తమైపోయింది అని చెప్పబడుతున్నది.

కూరేశుల కుమారులైన పరాశరభట్టర్ రహస్యత్రయ వ్యాఖ్యానంగా ఒక గ్రంథాన్ని అనుగ్రహించారు. అది, అష్టశ్లోకీ అనే సంస్కృత గ్రంథం. ఇది సుప్రసిద్ధమైనది. 8 శ్లోకాలను కలిగిన ఈ చిన్న గ్రంథంలో అర్థ విశేషాలు అనేకం, గోష్పాదంలో మహాసముద్రాన్ని ఇమిడ్చినట్లుగా, కూర్పబడ్డాయి.

కంచి వరదరాజస్వామి అపరావతారంగా ప్రసిద్ధులు, వడక్కు త్తిరువీధి ప్పిళ్ళై కుమారులు, సర్వజ్ఞులు అయిన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు రహస్య త్రయాన్ని చాలా విశదంగాను

అందంగానూ, అనవద్యంగాను అనుగ్రహించారు. అష్టాదశరహస్యం అని సుప్రసిద్ధమైన గ్రంథజాలం శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించినదే.

అష్టాదశరహస్యాలలో యాదృచ్ఛిక పడి, పరందపడి, శ్రియఃపతి పడి అనే గ్రంథాలు రహస్యత్రయ వ్యాఖ్యానాలుగా అవతరించాయి. అయినప్పటికీ, ముముక్షుప్పడి అనే దివ్యగ్రంథమే అనేక విధాలుగా గొప్పతనాన్ని కలిగినది. మిగిలిన గ్రంథాలు అతి సంగ్రహంగాను, అతి విస్తృతంగాను, సంస్కృత వాక్య బహుళంగాను ఉన్నందున వాటిలో కొంత కొరత ఉన్నదని, ఆ విధంగా ఉండే కొరత ఏమాత్రం లేకుండా, అవి అవతరించిన తరువాత ముముక్షుప్పడిఅనే ఈ గ్రంథం అవతరించినదని, దీని గొప్పతనాన్ని చూచి ఆస్తికులు అందరూ ఈ గ్రంథాన్నే విశేషించి పరిగ్రహించారు అని ఏర్పడుతున్నది. మిగిలిన గ్రంథాలలో చెప్పబడని పలు అపూర్వమైన విశేషాలు ఇందులో చోటు చేసుకున్నాయి అనేది కూడా ఇంకొక విధమైన వైలక్షణ్యం.

# భగవంతుని పక్షపాతరాహిత్యం

(శ్రీమాన్ కార్పంగాడు దేశిక వరదాచార్యస్వామివారు అనుగ్రహించిన ద్రావిడవ్యాసానికి అనువాదం)

**ప్రశ్న** –మానవుడై పుట్టినవాడు ఏమి చేయాలి?

**సమాధానం**– నిజమైన జ్ఞానాన్ని కలిగించే శాస్త్రాలను చదివి, మంచి చెడ్డలను వివేకించి తెలుసుకొని, జ్ఞానాన్ని కలిగినవాడై ఉండాలి.

**ప్రశ్న**– ఆ విధంగా అభ్యసించి మంచి చెడ్డలను తెలుసుకోకుండా ఉన్నవాడైతే, అతడు ఏ విధంగా లెక్కింపబడతాడు?

**సమాధానం** –అతడు మృగానికి సమానంగా భావింపబడతాడు.

**ప్రశ్న**– నిజమైన జ్ఞానాన్ని ఇచ్చే శాస్త్రాలు ఏవి?

**సమాధానం** –సరి అయిన జ్ఞానాన్ని ఇచ్చే శాస్త్రాలు.

**ప్రశ్న**– శాస్త్రాలు, ఈ లోకానికి సృష్టించినవాడు ఎవడు అని చెబుతున్నవి?

**సమాధానం** – భగవంతుడు అని చెబుతున్నది.

**ప్రశ్న**– భగవంతుడు ఎటువంటి స్వభావాన్ని కలిగినవాడు?

**సమాధానం** –అన్నిటినీ తెలిసినవాడు, అన్నిటినీ కలవాడు, దేవ మానవ దానవాదులకు అందరికీ సమానమై ఉండేవాడు, దయ కలవాడు, పక్షపాతం లేనివాడు–అని.

**ప్రశ్న** –భగవంతుడు అందరికీ సమానంగా ఉండేవాడై, పక్షపాతం లేనివాడై, దయను కలవాడై ఉండేవాడైతే, దేవ మానవ జంతు స్థావర భేదాలను ఏర్పాటు చేసి, దేవ శరీరాన్ని పొందినవారు సుఖాలను

అనుభవించడానికి తగిన వారినిగాను, మానవ శరీరాన్ని పొందినవారు సుఖదుఃఖాలను అనుభవించడానికి తగినవారుగాను, జంతు స్థావర శరీరాలను పొందినవారు పాప ఫలాన్ని అనుభవించడానికి తగినవారుగాను ఏర్పాటు చేయడానికి ఏమి కారణం?

**సమాధానం** –ఆత్మలు చేసిన పుణ్య పాపాలకు తగినట్లుగా ఈ విధమైన భేదాలను కలుగజేశాడు –అని తెలియాలి.

**ప్రశ్న** – ఈ మాట సరిపోదు, ఎందుకంటే, " తేన వినా తృణమపి న చలతి" (అతని ఆజ్ఞ లేకుండా గడ్డిపరక కూడా కదలదు) అని, "కర్తా కారయితా చ సః"– (ఆ భగవంతుడే అన్నీ చేస్తున్నాడు, చేస్తున్నాడు కూడా) అని చెప్పిన విధంగా, భగవంతుడు లేకుండా ఏ కార్యం సంభవించడం లేదు అని, అతడే అన్నిటినీ చేస్తున్నాడు అని తెలుస్తున్నది కదా. ఆ విధంగా ఉండగా, పుణ్య పాపాలను చేయిస్తున్న సర్వేశ్వరుడు ఆ పుణ్య పాపాలను అనుభవించకుండా, ఏమీ తెలియని ఆత్మలు పుణ్య పాపాలను చేస్తున్నారు అని ఒప్పుకోవడం ఏ విధంగా?

**సమాధానం** –ఒప్పుకొనవలసినదే

**ప్రశ్న** –తర్క ప్రమాణం చెప్పకుండా, " ఒప్పుకోవలసినదే" అని అంటే ఏ విధంగా ఒప్పుకోవడం? సరే, అది అటు ఉండనివ్వండి. సర్వేశ్వరుడు ఆత్మలను దేవతలు, మానవులు మొదలైన భేదం లేకుండా సృష్టించి, అన్నిటికీ ఒకే విధమైన సుఖదుఃఖాలను ఇవ్వనందు వల్ల, అతడు పక్షపాతాన్ని కలిగినవాడని తెలుస్తున్నది దయ కలిగినవాడైతే ఇతరుల దుఃఖాలను చూసిన వెంటనే, అయ్యో! అని జాలిపడి ఆ దుఃఖాలను

తీర్చాలి కదా! ఆ పని చేయకుండా, ఆత్మలు చేసే పాపకృత్యాలను కళ్ళారా చూస్తూ వాటికి అనుమతి ఇస్తున్నందున దయలేనివాడుగాను తెలుస్తున్నది వీటికి అన్నిటికి తార్కికమైన **సమాధానం** చెప్పండి.

**సమాధానం**– దేవ మనుష్యాది భేదాలను భగవంతుడు ఆత్మలు చేసిన పుణ్య పాపాలకు తగినట్లుగానే కలిగిస్తున్నాడని గ్రహించాలి. ఏ విధంగా అంటే, ఈ ఆత్మలు శరీరేంద్రియాలను ఏమీ లేకుండా ఉండే కాలంలో, భగవంతుడు వాటిని ఇచ్చి, ప్రవృత్తి నివృత్తి శక్తులను కూడా ఇచ్చి, మంచి కార్యాలను విచారించి తెలుసుకొని దానికి అనుగుణంగా ప్రవర్తించటానికి తగిన శాస్త్రాలను కూడా ఇచ్చి సహాయపడుతున్నాడు. ఆత్మలు ఈ సాధనాలతో ప్రతీకార్యంనూ ప్రయత్నం చేస్తున్నారు. ఆ విధంగా ప్రయత్నం చేసే ప్రథమ ప్రయత్నాలలో సర్వేశ్వరుడు ఏ సంబంధంలేనివాడై ఉంటున్నాడు.

**ప్రశ్న** –ఆత్మలు చేసే ప్రయత్నాలలో భగవంతునకు సంబంధం లేకపోతే, అతడు సర్వకారణం అని అనేది ఏ విధంగా సరిపోతుంది?

**సమాధానం** – కుండను నిర్మించటానికి కుమ్మరివాడు, మన్ను, దండ, చక్రాలు ముఖ్య కారణాలుగాను, కాలం, చోటు మొదలైనవి సాధారణ కారణాలుగాను చెప్పేటట్లుగా, ఆత్మలు ఒక్కొక్క కార్యాలను చేసే ప్రథమ ప్రయత్నంలో ఆ ఆత్మలు ముఖ్య కారణాలు అయినప్పటికీ, అవి ప్రయత్నం చేయడానికి హేతువైన ప్రవృత్తి నివృత్తులను ఇచ్చినవాడు భగవంతుడే కనుక, అతడు సాధారణ కారణం అవుతున్నాడు. అందుచేత అతడు సర్వకారణం అన్నదానికి ఏ విధమైన లోటు లేదు. మంత్రి ఒక

కార్యాన్ని చేయడానికి ప్రయత్నించేవాడైతే, ఆ కార్యం రాజు అనుమతి లేకుండా ఏ విధంగా పూర్తి కావడం లేదో, ఆ విధంగానే, ఆత్మలు భగవంతుని సంబంధం లేకుండా ప్రయత్నం చేసిన ప్రథమ ప్రయత్నాల తరువాత, ఈశ్వరుడు ఇచ్చే ఆజ్ఞ లేకుండా పూర్తి కావడం లేదు కనుక, అతడు లేకుండా ఏకార్యం సంభవించడం లేదు అని, అతడే అన్నిటిని చేయిస్తున్నాడని చెప్పబడుతున్నది.

**ప్రశ్న** – ఆత్మలు ముందు చేసే ప్రయత్నాలు, ఒక ఆత్మ కోరినట్లుగానే ఇంకొక ఆత్మ కోరనందువల్ల, ఈ ప్రయత్నాలు అనేక విధాలుగా కనబడుతున్నాయి కదా. ఈ విధంగా గోచరించడానికి ఏమి కారణం?

**సమాధానం** – ఆయా ఆత్మలు చేసిన పూర్వజన్మలోని పుణ్య పాపాలకు తగినట్లుగా అవి ప్రయత్నిస్తున్నవి కనుక, వాటి ప్రయత్నాలు కూడా అనేక విధాలుగా ఉంటాయని తెలియాలి.

**ప్రశ్న** –అనాది అయిన పుణ్య పాపాలు ఈ ఆత్మలను ప్రేరేపించగా, దానికి తగినట్లు ఈ ఆత్మలు పుణ్య పాపాలను చేస్తున్నాయి –అని అంటే, వీటికి నరకం మొదలైన అనుభవాలు ఉండే రీతి ఏ విధంగా?

**సమాధానం** – ఒకనికి ఆకలి కలిగితే ఆకలి అన్నాన్ని తినేటట్లు ఆకలి కలిగినవానికి రుచిని కలిగిస్తుంది. ఆ తరువాత, అతడు భుజించటానికి ప్రయత్నం చేసేటప్పుడు ఇంకొకడు వచ్చి " నీవు భుజించాలని ఆశపడే అన్నంలో విషం కలిసింది సుమా! " అని తెలియజేశాడు. వీడు దానిని తెలుసుకొని, "ఈ అన్నాన్ని నేను తింటే, ఇది నా ప్రాణాలను పోగొడుతుంది "అనే భావంతో ఆకలిబాధను కూడా తట్టుకొని,

భుజించాలనే ప్రయత్నాన్ని విడచి పెడుతున్నాడు. ఇందువల్ల, ఆకలి ఆశను మాత్రం కలిగిస్తున్నదని, ఆకలిని కలవాడు ఆశ వల్ల కలిగే చెడ్డను భావించి, ఆ ఆశను పోగొట్టుకోవడానికి శక్తిని కలవాడై ఉంటున్నాడనే విషయం తెలుస్తుంది. ఆ విధంగానే, పుణ్య పాపాలు, ఆపుణ్య పాప ఫలాలకు అనుగుణమైన రుచిని కలిగిస్తాయి తప్ప, ఇంకొక పుణ్య పాపాలను కలిగించవు అవి, రుచిని కలిగించిన కాలంలో జీవుడు తన ప్రవృత్తి నివృత్తి శక్తిచేత పాప ఫలంలో కలిగే ఆశ విషయంలో భయపడి, దానిని విడచిపెట్టి ప్రవర్తించడానికి, పుణ్యఫలం వల్ల కలిగే ఆశ విషయంలో మనసులో సంతోషంతో దానిని గ్రహించి నడవడానికి తగినవాడు అవుతున్నాడు. అందుచేత, అనాది అయిన కర్మలు చేయించగా, ఈ ఆత్మలు చేస్తున్నాయి– అని కర్మకు అతిశయాన్ని చెప్పడం తగదు.

కొన్ని ఆత్మలు సత్కార్యాలను విడచిపెట్టి చెడ్డ కార్యాలలో ప్రవర్తిస్తున్నందున, ఆ ఆత్మలకు నరకానుభవం కలుగుతున్నదని తెలియాలి.

**ప్రశ్న** –ఆత్మలు చేసే ప్రథమ ప్రయత్నంలో సర్వేశ్వరుడు ఏ సంబంధం లేని వాడై ఉన్నాడు– అని అంటే, ప్రథమ ప్రయత్నంతో ఈ ఆత్మలు తమ కార్యాలను చేయగలరా?

**సమాధానం**– చేయలేరు.

**ప్రశ్న** –అయితే మరి, ఈ ఆత్మలు ఏ విధంగా కార్యాలను చేస్తున్నారు?

**సమాధానం** – తరువాత రెండవ ప్రయత్నంలో సర్వేశ్వరుడు అనుమతిని ఇచ్చిన తరువాత, ఆత్మలు చేసిన ప్రథమ ప్రయత్నాలు ప్రయోజనం కలిగినవి అవుతున్నాయి.

**ప్రశ్న**– ఆ విధంగా అయితే, భగవంతుడు చేసే అనుజ్ఞ కదా, ముఖ్య ప్రయోజనం అవుతున్నది. అందుచేత, ఈ ఆత్మలు చేసే పుణ్య పాప ఫలాలు సర్వేశ్వరునకు చెందాలి కదా

సమాధానం –అన్నా తమ్ముళ్లు ముగ్గురికి, సాధారణంగా ఉండే ధనంలో, తమ్ముళ్లు ఇద్దరిలో ఒకడు అన్నగారి అనుజ్ఞను పొంది, కొంచెం ధనాన్ని తీసుకొని వెళ్ళిపోయాడు. ఇంకొకడు, ఒక నిమ్మపండును అన్నగారి అనుమతితో తీసుకొని వెళ్ళాడు. ఈ ఇద్దరిలో, కొంచెం ధనాన్ని తీసుకొని వెళ్ళినవాడు వ్యాపారం చేసి నష్టపోయాడు. నిమ్మపండును తీసుకుని వెళ్లినవాడు ప్రభవు దగ్గరకు వెళ్లి, ఆ నిమ్మపండును ఆ ప్రభువుకు ఇచ్చి, సంతోషం పెట్టి, రాజ్యసంపదను పొందాడు. ఈ ఇద్దరిలో, ముందు వ్యాపారం చేసి నష్టం పొందినవాని నష్టం, రాజ్యసంబంధాన్ని పొందినవాని లాభం, ఈ రెండు ఇద్దరినీ అనుగ్రహించిన అన్నకు రావడం లేదు కదా. సరే, అది ఉండనివ్వండి. యజమాని పల్లకిని మోసేవారిని "పల్లకిని మోయండి "అని అనుమతిని ఇస్తే, వెంటనే ఆ అనుమతి ప్రకారం వారు ఆ పల్లకిని మోయడంవల్ల ఏర్పడే శ్రమ మొదలైన కష్టాలు అనుమతి ఇచ్చిన ప్రభువునకు కలగడం లేదే! ఆ విధంగానే, ఆత్మలు ద్వితీయ ప్రయత్నాలలో సర్వేశ్వరుడు ఇచ్చే అనుమతి వల్ల కలిగే ప్రయోజనాలు సర్వేశ్వరునకు చెందవు –అని తెలుసుకోవాలి.

**ప్రశ్న**– ఆత్మలకు పూర్వకర్మ ఫలానుసారంగా ఒక కార్యంలో ఇచ్ఛ, వేరొక కార్యంలో వెగటు కలిగేటట్లయితే, వీటికి పూర్వకర్మం ఏ విధంగా వచ్చింది?

సమాధానం– కర్మ అనాది అయినందువల్ల వచ్చిందని తెలియాలి.

**ప్రశ్న** – "కర్మ కలుగుతున్నది, నశిస్తున్నది", అని లోకవ్యవహారం ఉండడాన్ని చూస్తున్నాం. ఆ కర్మలకు మొదట ఈ కాలమని, పూర్తి ఈ కాలమని తోచాలి కనుక, ఏ కాలం నుండి ఈ కర్మ ఆరంభమైనది?

సమాధానం– ఇక్కడ అనాది అనేది, ఈ కాలంలో ఏర్పడినదని తెలియడానికి సాధ్యం కాని ప్రారంభాన్ని కలిగినది– అని అర్థాన్ని గ్రహించాలి.

**ప్రశ్న**– ఆకాశపద్మం, గొడ్రాలి కొడుకు మొదలైనవాటివలె తెలియని ఆది అనేది ఒకటి ఉంటుందా?

సమాధానం –ఉంటుంది.

**ప్రశ్న** –ఏ విధంగా?

సమాధానం– విత్తనం, మొలక అనే ఈ రెండిటిలో, వృక్షానికి విత్తనం మొదలా? విత్తనానికి వృక్షం మొదలా? అని అంటే, "ఇదే మొదలు "అని ఏ విధంగా చెప్పడానికి సాధ్యం కాదో, ఆ విధంగానే, అనాది అనేదానికి "ఈ కాలంలో ఆరంభమైనది" అని తెలియడానికి సాధ్యం కానిది అని అర్థం గ్రహించడంలో ఏ విధమైన లోటు లేదని తెలియాలి.

**ప్రశ్న** –ఇంతవరకు చెప్పినదానిని అంతటినీ సంగ్రహించి చెప్పండి.

సమాధానం– ఇంతవరకు చెప్పినదానిని బట్టి, ఆత్మలు చేసిన పూర్వకర్మలను అనుసరించి దేవ మనుష్యాది బేధాలను సర్వేశ్వరుడు

కలిగిస్తున్నాడు అని, ఆ కర్మం అనాది అని, సర్వేశ్వరుడు ఇచ్చిన ప్రవృత్తినివృత్తులతో సత్కార్యాలలో ప్రవర్తించకపోతే ఆ పాపాలు ఆత్మలకే చెందుతాయి అని, ఆత్మలు ప్రథమ ప్రయత్నంలో సర్వేశ్వరుని సంబంధం లేదు కనుక, ఆ ఆత్మను చేసిన పాపాలు సర్వేశ్వరులకు చెందవు అని, సర్వేశ్వరుడు క్రమాన్ని అనుసరించి ఆత్మలకు సుఖదుఃఖాలను ఇస్తున్నాడు, కనుక, పక్షపాతాన్ని కలవాడు కాడు– అని ఇంతవరకు చెప్పబడింది.

**ప్రశ్న**– సర్వేశ్వరుడు పక్షపాతం లేనివాడు అని ఒప్పుకోదగినది అయినప్పటికీ, దయ లేనివాడు –అనే దోషం ఉన్నది. ఏ విధంగా అంటే, దయను చూపించే శక్తి గలవాడొకడు, తన ముందు శక్తి లేనివాడొకడు బావిలో పడిపోతే, ఆ విధంగా పడిపోయినవానిని దయ కలవాడు పైకి తీసుకొని రావాలి. గట్టుపైకి తీసుకొని వస్తే అతనిని దయగలవాడు అని చెప్పవచ్చు. ఆ విధంగానే, చాలా దుఃఖాలను కలిగించే పాపాలలో ఈ ఆత్మలు ప్రవర్తించే సమయంలో భగవంతుడు ఆ విధంగా వారిని ప్రవర్తించనీయకుండా అడ్డుకోవాలి కదా. ఆ విధంగా చేయడం లేదు కనుక, భగవంతుడు దయలేనివాడు అని కదా చెప్పవలసి ఉన్నది.

సమాధానం– ఆ విధంగా చెప్పడానికి వీలు కాదు. ఇక్కడ చూపించిన దృష్టాంతం ఎంత మాత్రం పొసగదు. ఎందుకంటే, శక్తిని కలవాడు ఒకడు బావిలో పడిపోవడాన్ని చూడడం శక్తిని, దయను కలిగినవానికి తగినదే. శక్తి కలిగినవాడై, నీటిలో క్రీడించడం కోసం దానిలో దూకినవాడైతే, దానిని శక్తిని దయను కలవాడు వేడుకగా చూస్తూ ఉంటాడు కదా. ఆ విధంగానే,

ప్రవృత్తి నివృత్తి శక్తులను కలిగిన ఆత్మలు చెడ్డ మార్గంలో ప్రవేశించడాన్ని అడ్డుకోవడానికి సర్వేశ్వరుడు అనుమతి ఇస్తున్నాడు. ఏ భావంతో అనుమతి ఇస్తున్నాడు? అంటే, ప్రభువు చెడ్డ మార్గంలో ప్రవర్తించేవారిని దండించి భయాన్ని కలిగించి, మంచి మార్గంలో పెట్టేటట్లే, చెడ్డమార్గంలో ప్రవర్తించే ఆత్మలను పాపఫలాలను అనుభవింప జేయడం ద్వారా భయపడేటట్లు చేస్తే, తరువాత ఆ ఆత్మలు మంచి మార్గంలోకి వస్తాయి– అనే భావంతోనే చేస్తున్నాడు– అని భావించాలి.

**ప్రశ్న**– దండించడం అనేది చాలా దుఃఖకరమై ఉన్నందున, ఈ కార్యాన్ని చేసే సర్వేశ్వరుడు నీతిని కలవాడు అని ఏ విధంగా చెప్పడం?

సమాధానం– క్రూరులను ప్రభువు దండించడం దోషం కాదు. అతనికి ధర్మమే అవుతుంది. వారిని దండించడం అనేది పెరిగే పైరులో ఏర్పడే కలుపును తీయడ వంటిది అని చెప్పడం వల్ల, సర్వేశ్వరుడు క్రూరులను దండించడం సరి అయినదే తప్ప, వేరు కాదు అని గ్రహించాలి.

**ప్రశ్న**– దోషం కలవారిని సహించడమే కదా సహనం కలిగి ఉండడానికి అందం. ఆ విధంగా ఉండగా, సహనానికి అంతటికి ఉత్పత్తి స్థానం అని చెప్పబడే సర్వేశ్వరుడు దోషం కలిగినవారిని సహించి ఆదరించడం లేదు అంటే, అతడు సహనం కలిగినవాడు అని ఏ విధంగా చెప్పడం?

సమాధానం– ఆత్మలు ఎన్నో కల్పాల కాలంగా అనుభవించి పోగొట్టుకోలేని మహా పాప కార్యాలను ఒక్క క్షణకాలంలో చేస్తున్నారు, ఈ విధంగా చేసిన పాపాలు లెక్కలేనివి. ఈ విధంగా లెక్కలేనన్ని పాపాలను చేసిన ఆత్మలు సర్వేశ్వరుని పొందాలనే అనే ఒక మంచి జ్ఞానం వాటికి

కలిగింది అంటే, ఇన్ని పాప కార్యాలను సహించి సర్వేశ్వరుడు రక్షిస్తున్నాడు కనుకనే కలుగుతున్నది. అందుచేత, అతడు మిక్కిలి దయ కలిగినవాడు అనేదానికి ఏ విధమైన కొరత లేదు– అని తెలియాలి.

**ప్రశ్న** –ఆత్మలు చేసిన పుణ్య పాపాలకు తగినట్లుగా సర్వేశ్వరుడు వాటికి ఫలాన్ని ఇస్తున్నాడు అంటే, పుణ్య పాపాలు కదా స్వతంత్ర కర్తగాను, వాటిని ఎదురుచూసి సర్వేశ్వరుడు ఫలాలను ఇస్తున్నాడు అంటే, సర్వేశ్వరుడు స్వాతంత్ర్యం లేనివాడు గాను తోస్తున్నది?

సమాధానం– భగవంతుడు "పుణ్య పాపాలకు తగినట్లుగా మనం ఫలాలను ఇస్తాం" అని సంకల్పిస్తున్నాడు. ఆ సంకల్పం ఎవరివల్ల అడ్డుపెట్టబడకుండా, అనేక కల్పాల కాలంగా నడుస్తూ ఉన్నది కనుక, అతని స్వాతంత్రం ఏ విధమైన అడ్డు లేకుండా ఉన్నది అని అనడంలో ఏ అడ్డు లేదు.

**ప్రశ్న** –ఇంతవరకు చెప్పినవానిని సంగ్రహించి పలకండి.

సమాధాన– చెడ్డ మార్గంలో ప్రవర్తించే ఆత్మలను ఇక అయినా ఆ దారిలో వెళ్లకుండా ఉండాలని భావంతో ఆ ఆత్మలను పాప ఫలాలను అనుభవించేటట్లు భగవంతుడు చేస్తున్నాడు కనుక అతడు దయను కలవాడు అని, తనను పొందాలి అనే భావాన్ని కలిగిన వారు అంతకు ముందు మహా పాపాలను చేసినవారు అయినా, వారు చేసిన పాపాలను సహించి రక్షిస్తున్నాడు కనుక సహనం కలిగిన వాడు అని, "ఆత్మల పుణ్య పాపాలకు తగినట్లుగా వాటిని శిక్షిస్తాను" అని సర్వేశ్వరుని సంకల్పం అనేక కల్పాల కాలంగా నడుస్తూ వస్తున్నందున అతడు

స్వతంత్రుడని, ఆ స్వామి స్వాతంత్ర్యానికి ఏ విధమైన ఆటంకం లేదని చెప్పబడినట్లు అయినది.

# శ్రీకూరేశుల ఉక్తిచాతుర్యమ్

(కాంచీ మహావిద్వాన్ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారి ద్రావిడవ్యాసానికి అనువాదం)

భగవంతుని స్తుతించే భక్తశిఖామణులు తమ పలు విధాలయిన అనుభవాలలో, విలక్షణమైన అనుభవాన్ని ప్రదర్శిస్తారు. అదేమి? అంటే, భగవంతుని ఉద్దేశించి కొన్ని ప్రశ్నలను అడగడం ద్వారా విలక్షణమైన గుణానుభవం చేయడం. పొయ్ గై ఆళ్వార్లు, నమ్మాళ్వారులు, తిరుమంగై ఆళ్వార్లు మొదలైనవారు ఇటువంటి అనుభవానికి దారి చూపారు.

సరోయోగి, ముదల్ తిరువందాది అనే ప్రబంధంలో 69వ పాశురంలో,

పాలన్ తనదురువాయ్ ఏழులగుణ్ణు
ఆలిలైయిన్ మేలన్ను నీ వళర్ న్దదు మెయ్యెన్బర్, – ఆలన్ను
వేలై నీరుళ్ళదో? విణ్ణదో? మణ్ణదో?
శోలై శూழ் కున్రెడుత్తాయ్! శొల్లు

(చిన్న బాలుడి రూపంలో ఏడు లోకాలను ఆరగించి, మర్రి చిగురుటాకుపై నీవు ఆనాడు శయనించినది వాస్తవమని మహర్షులు అంటున్నారు. ఆ మర్రి ఆకు ప్రళయ సముద్రంలో ఉన్నదా? ఆకాశంలో ఉన్నదా? భూమిపై ఉన్నదా? తోటలను చుట్టూ కలిగిన గోవర్ధన పర్వతాన్ని ఎత్తినవాడా! నాకు సమాధానం చెప్పు) అని ప్రశ్నించారు.

నమ్మాళ్వార్లు అడిగిన ప్రశ్నలు అనేకం. వాటిలో ఒక్క ప్రశ్నను మాత్రం వినండి. పెరియ తిరువందాది అనే ప్రబంధంలో (16)

శీరాల్ పిఱందు శిఱప్పాల్ వళరాదు

పేర్ వామననాగా క్కాల్ పేరాళా! – మార్బార
ప్పుల్ కి నీ ఉండుమిఝ్న్డ పూమి నీరేఱ్పరిదే!
శొల్లు నీ యా మఱియ చ్చ్యాఝ్న్డు.

మహానుభావా! చక్కగా పుట్టావు, గొప్పగా పెరిగావు– అనే కీర్తి లేకుండా, నీవు వామనుడవై, అవతరించావు. ఈ విధంగా పుడితే తప్ప భూమినిదానంగా గ్రహించడానికే వీలు కాదనా? వరాహరూపుడవై భూమిని కౌగిలించుకొని పైకెత్తావు. భూమిని మింగి, తరువాత వెలువరించి కాపాడావు. ఈ విధంగా ఈ భూమి అంతా నీ సొత్తుగా ఉన్నది. మరి, నీవు వామనుడవై ఎందుకు అవతరించావో నాకు అర్థం అయ్యేటట్లు చెప్పు)
అనేది ఒక ప్రశ్న.

తిరుమంగై ఆళ్వారులు అడిగిన ప్రశ్నలు కూడా చాలా ఉన్నాయి. అందులో ఒక ప్రశ్నను (పెరియ తిరుమొఝి– 7 –9– 7) గమనించండి.
శేయోంగు తణ్ తిరుమాలిరుమ్ శోలైమలై ఉఱైయుమ్
మాయా! ఎన క్కురైయాయ్! ఇదు, మఱై నాన్గినుళాయో?
తీయోంబు కైమ్మఱైయోర్ శిఱుపులియూర్ శలశయన
త్తాయో? ఉనదడియార్ మనత్తాయో?
(చల్లని వనగిరిలో నివసించే, ఆశ్చర్యకరమైన లీలలను కలవాడా! నాకు ఈ విషయాన్ని వివరించి చెప్పు. నీవు నాలుగు వేదాలలో ఉన్నావా ? నిత్యం అగ్నిహోత్రాన్ని ఆరాధించే వైదికులు నివసిస్తున్న

తిరుప్పులియూర్ దివ్యదేశంలో ఉన్నావా? లేక, నీ భక్తుల మనసులలో ఉన్నావా?)

అనేది ఒక ప్రశ్న. ఈ ప్రశ్నలను వివరించి అనుభవిస్తే, చాలా మధురంగా ఉంటుంది.

కూరేశుల స్తవాలలో అతిమానుష, సుందరబాహు, వరదరాజస్తవాలలో చాలా రసఘనంగా ప్రశ్నలు గోచరిస్తాయి. తిరుమాలిరుమ్ శోలైలోని సుందర బాహు స్వామిని ప్రశ్నించే మూడు ప్రశ్నలు అమరి ఉండే ఒక శ్లోకాన్ని మాత్రం ఇక్కడ సంగ్రహంగా అనుభవిద్దాం.

గూహిత స్వమహిమాపి సుందర!
త్వం వ్రజే కిమితి శక్రమాక్రమీః?
సప్తరాత్ర మదధాచ్ఛ కిం గిరిం?
పృచ్ఛత శ్చ సుహృదః కిమక్రుధః?

(సుందరబాహుస్వామీ! శ్రీ కృష్ణావతారంలో, నీవు నీ మహిమను కప్పిపుచ్చుకున్నవాడవు అయినా, రేపల్లెలో ఎందుకు నీవు ఇంద్రుని జయించావు? ఏడు రాత్రుల పాటు గోవర్ధన పర్వతాన్ని ఎందుకు ధరించావు? నీవెవరు ? అని నిన్ను ప్రశ్నించిన నీ స్నేహితులపై ఎందుకు కోపపడ్డావు?)

ఇది సుందరబాహుస్తవంలోని 112వ శ్లోకం.

ఈ శ్లోకంలో ఉండే మూడు ప్రశ్నలు ఏమంటే−

సౌలభ్య, సౌశీల్యాలను ప్రదర్శించి పరత్వాన్ని మరుగుపరచి, మనుష్యత్వాన్ని ప్రదర్శించడం కోసం వచ్చిన సందర్భంలో, పరత్వం వ్యర్థమయ్యే రీతిలోని లీలలను మాటిమాటికి ఎందుకు ప్రదర్శించావు? అనేది ముఖ్యమైన ప్రశ్న.

సుందర బాహు స్వామీ! నీవు " ఒరుత్తి మకనాయ్ పిఱందు, ఓరిరవిల్ ఒరుత్తి మకనాయ్ ఒళిత్తు" (ఒకే రాత్రిలో దేవకీదేవికి కుమారుడపై పుట్టి, అదే రాత్రిలో యశోదా దేవికి కుమారుడపై రహస్యంగా) పెరగడం నీ శక్తి విశేషాలను అన్నిటిని మఱుగు పరచుకోవడానికి కోసమే కదా! ఆ విధంగా ఉన్నప్పటికీ, చిరకాలంగా రేపల్లెలో జరుగుతూ వచ్చిన దేవేంద్ర సమారాధనను నీవెందుకు అడ్డుపెట్టావు? అనేది మొదటి ప్రశ్న.

దీనికి భగవంతుడు, లేదా, అతని ప్రతినిధులు చెప్పే సమాధానం ఏమంటే, పరాత్పరుడైన తాను ఉండే ఊరిలో దేవతాంతరానికి ఆరాధన జరగడం ఏమి? అని భావించినందువల్లనే అడ్డుపెట్టానని.

ఆ దేవేంద్రుడు ఏడు నాళ్లపాటు రాళ్ల వర్షాన్ని కురిపించి, గొల్లలకు, గోవులకు చాలా గొప్ప ఆపదను కలిగించినప్పుడు, అతని శిరస్సును ఖండించి వధించవలసి ఉండగా, ఆ విధంగా చేయకుండా, గోవర్ధన పర్వతాన్ని ఒక గొడుగుగా ధరించి నిలిచావేమి ? అనేది రెండవ ప్రశ్న.

ఇంద్రుని అన్నాన్ని అడ్డుపెట్టిన నేను అతని ప్రాణాన్ని కూడా తీసివేయాలా? " ఈ పర్వతం మనకు రక్షకం "అని నేను మొదట చెప్పిన

మాటను నిజం చేసి, ఈ పర్వతంతోనే వర్షం వల్ల కలిగిన ఉపద్రవాన్ని అడ్డుకొని కాపాడతాను, అతడికి చేయి నొప్పి పుట్టగానే తానే తన ప్రయత్నాన్ని మానేస్తాడు– అనే విశాలమైన మనస్సుతోనే –అనేది ఇక్కడ సమాధానం.

ఏడు సంవత్సరాల వయస్సును గల చిన్న బాలుడై, పర్వతాన్ని ఎత్తి నిలచి చేసిన అతిమానుష లీలను చూసి, ఆశ్చర్యపడిన గొల్లలు ఆ శ్రీకృష్ణుని జన్మ విషయంలో సందేహాన్ని పొందినవారై, " దేవో వా ?దానవో వా త్వం? యక్షో గంధర్వ ఏవ వా?" – (నీవు దేవుడవా? దానవుడవా? యక్షుడవా? గంధర్వుడవా?) అని "నీవు ఎవడవు? "అని అడగగానే, " క్షణం భూత్వా త్వసౌ తూష్ణీం కించిత్ ప్రణయరోషవాన్" అనే విధంగా, ఆ విధంగా వారు అడిగిన దానికి కోపపడినట్లుగా ఉన్నదే! ఆ విధంగా నీవు కోపడేటట్లుగా వారు ఏమీ అడగలేదే! ఆ విధంగా ఉండగా, కోపపడడం ఎందుకు? అనేది మూడవ ప్రశ్న.

గొల్లలలో చాలా చిట్టచివరివాడుగా తాను వచ్చి జన్మించినప్పటికీ కూడా, సజాతీయుని విజాతీయుని చేసి ప్రశ్నించినందున కోపం కలిగింది –అనేది ఇక్కడ సమాధానం.

ఇందువల్ల, శ్రీకృష్ణునకు దేవత్వంలో కంటే, గోపాలత్వమే మిక్కిలి ఆదరణీయమైనది– అని తెలుస్తుంది. ఇటువంటి అర్థాలు వ్యక్తమయ్యేటట్లుగా చేసిన ప్రశ్నలు కదా ఇవి!

# మన ఆచార్యుల వాక్చాతుర్యమ్

(కాంచీ ప్రతివాది భయంకరమ్ శ్రీ అణ్ణంగరాచార్యస్వామివారి ద్రావిడవ్యాసానికి అనువాదం)

శ్రీవైష్ణవ సంప్రదాయంలో ద్రావిడభాషలో మొట్టమొదటగా అవతరించిన వ్యాఖ్యాన గ్రంథం ఆఱాయిరప్పడి అనే గ్రంథం. ఇది తిరువాయ్ మొழி ప్రబంధానికి తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ అనే ఆచార్యులు అనుగ్రహించిన వ్యాఖ్యానం. దీని గొప్పతనాన్ని శ్రీవరవరమునులు ఉపదేశ రత్తినమాలై అనే ప్రబంధంలో " తెళ్ళారుమ్ ఞాన త్తిరుక్కురుకై పిరాన్ పిళ్ళాన్ ఎతిరాశర్ పేరరుళాల్, ఉళ్ళారుమ్ అన్బుడనే మాఱన్ మఱైప్పొరుళై అన఼్రైత్తదు ఇన్బమిగు మాఱాయిరమ్" (స్పష్టమైన జ్ఞానాన్ని కలిగిన తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ భగవద్రామానుజుల ఆజ్ఞానుసారం మనసులో నిండుగా ఉండే వాత్సల్యం చేత నమ్మాళ్వారులు అనుగ్రహించిన తిరువాయ్ మొழி ప్రబంధానికి అర్థాన్ని అనుగ్రహించిన వ్యాఖ్యానం ఏదంటే, మిక్కిలి మధురమైన ఆఱాయిరప్పడి) అనే పాశురం ద్వారా వ్యక్తం చేశారు. "ఇన్బమికు మాఱాయారమ్" అనేది అమూల్యమైన సూక్తి. ఆ వ్యాఖ్యానంలో ఉండే మాధుర్యాతిశయాన్ని అనుభవరసికులే తెలియగలరు.

ఈ వ్యాఖ్యానానికి ముందు కూడా సంప్రదాయంలో ద్రావిడ వ్యాఖ్యాన గ్రంథాలు, లేక, ద్రావిడ వచన గ్రంథాలు కొన్ని కొందరి ఆచార్యులచే అనుగ్రహింపబడి ఉండి ఉండవచ్చు. అయితే, ఆ విధంగా ఏ

గ్రంథం మనకు ఇప్పుడు లభించడం లేదు. ఆఱాయిరప్పడి అనే వ్యాఖ్యాన గ్రంథం మాత్రమే మన సంప్రదాయానికి మొట్టమొదటి వ్యాఖ్యాన గ్రంథంగా గమనిస్తున్నాం. ఈ గ్రంథం అవతరించి ఇప్పటికీ ఇంచుమించుగా వేయి సంవత్సరాలు అవుతున్నది. ఇది కేవలం ద్రావిడ గ్రంథం కాదు. మణిప్రవాళ వ్యాఖ్యానం అనే పేరును పొందింది. అంటే, ద్రావిడ పదాలు, సంస్కృత వాక్యాలు కలిపి రచింపబడిన వ్యాఖ్యానం అని అర్థం. ఈ కలయికలోని అందం చాలా అద్భుతమైనది. ఉభయ వేదాంత ప్రవర్తకాచార్యులు అని మన ఆచార్యులు పొందిన విలక్షణమైన నామం ఇటువంటి మణిప్రవాళ గ్రంథాల వల్లనే దార్ఢ్యాన్ని పొందుతున్నది. చాలా ప్రాచీన కాలంలో జైన బౌద్ధుల సంప్రదాయంలో మణిప్రవాళ గ్రంథాల అవతరించాయని కొందరు విమర్శకులు చెప్పగా వింటున్నాము. వాటిలో సాధారణ సంస్కృత పదాలు ద్రావిడ పదాలు కలసి ఉంటాయి తప్ప, వేద స్మృతీతిహాస పురాణ వచనాలు, కావ్య నాటకాలు శ్లోకాలు, పలు విధాసైన ద్రావిడ గ్రంథాల ప్రమాణాలు కలసి పరిమళించిన ప్రసిద్ధి లేదు.

ఆఱాయిరప్పడి వ్యాఖ్యానం తరువాత, పెరియ వాచ్చాన్ పిళ్లై, వడక్కు త్తిరువీది ప్పిళ్ళై మొదలైన వారు రచించిన వ్యాఖ్యానాలలోని మాధుర్యం, గాంభీర్యం అంతు లేనిది. ఆఱాయిరప్పడి వ్యాఖ్యానం అనేది చాలా సంగ్రహమైన శైలిలో రచింపబడినందునందున, అందులో పూర్వాచార్యుల సంవాదాలు కానీ, ఇతిహాస పురాణాది శ్లోకాల మధురార్థాలు కానీ దర్శించడానికి అవకాశం లేకపోయింది. పెరియ

వాచ్చాన్ పిళ్లై, వడక్కు త్తిరువీది ప్పిళ్ళై అనుగ్రహించిన వ్యాఖ్యానాలలో మాధుర్యాతిశయాన్ని గూర్చిన ప్రసంగానికి మనమా అధికారులం!

వీరి వ్యాఖ్యానాలలోని పద సందర్భాలలో ప్రకాశించే అందం ఏమి ఆశ్చర్యం! అని అనేటట్లుగా రాతి గుండెవారిని కూడా కరిగిస్తుంది. వీరి వ్యాఖ్యానాలు అవతరించి ఉండకపోతే, ఆళ్వారుల దివ్య ప్రబంధాలకు విస్తృతమైన గౌరవం లభించి ఉండేది కాదు.

కంబమహాకవి కాలంలో దివ్యప్రబంధాలకు చాలా విశేషంగా వ్యాఖ్యానాలు ఏమీ అవతరించక పోయినందున, వారు దివ్య ప్రబంధాల మూలంలోని మాధుర్యంలో మాత్రమే అభినివేశాన్ని పొంది, " అందమిలా మఱై ఆయిర త్తాழ்న్ద అరుమ్ పొరుళై" ఇత్యాదిగా పలికారు. వ్యాఖ్యానాలు అవతరించిన తరువాత, వాటిలో కూడా, ముఖ్యంగా పెరియ వాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానాలు అవతరించిన తరువాత, ఈ లోకానికి కలిగిన గొప్ప భాగ్యాన్ని మణవాళ మహామునులు ఉపదేశరత్తిన మాలై ప్రబంధంలో " పెరియ వాచ్చాన్ పిళ్లై పిన్బుళ్ళవైక్కుమ్ తెరియ వియాక్కియైకళ్ శెయ్ వాల్ ఆరియ ఆరుళిచ్చెయల్ పొరుళై ఆరియర్ కట్కిప్పోదు అరుళి చ్చెయలాయ్ త్తఱిందు" (పెరియ వాచ్చాన్ పిళ్ళై అనంతర కాలంవారు కూడా తెలుసుకునే విధంగా వ్యాఖ్యానాలను అనుగ్రహించినందున, అర్థం చేసుకోవడానికి అరుదైన ఆళ్వారుల దివ్య ప్రబంధాల అర్థాలను ఈనాటి ఆచార్యులు తెలుసుకోవడానికి వీలవుతున్నది) అనే పాశురంతో పరమార్థంగా అనుగ్రహించారు.

చాలాకాలం ఆచార్య సన్నిధిలో గురుశుశ్రూషణ చేసి, చాలా కాలం శ్రవణం చేసి ఉన్నతమైన, అమూల్యమైన అర్థాలతో నిండిన ఆ అరుదైన గొప్ప వ్యాఖ్యానాలను గురుముఖంగా వినకుండా, స్వతంత్రంగా గ్రంథాలను చూసి అన్వయించుకుని తెలిసికోవాలి అని ప్రయత్నం చేసేవారు కొందరు ఉండవచ్చు. వారు ఆవ్యాఖ్యానాల వల్ల కొంచెం కూడా ప్రయోజనాన్ని పొందలేరు. కనుక, "వాటిలో ఏమున్నది?" అని, "మనకు తెలియని శైలిలో ఏదో రాసి పెట్టారు" అని పలికి కాలక్షేపాన్ని చేసేవారే అవుతారు. వాస్తవానికి, పూర్వకాలంలో దివ్యదేశాలలో అంతట పలుచోట్ల కాలక్షేపాలు జరుగుతూ వచ్చాయి. వ్యాఖ్యాన గ్రంథాలను పెట్టుకొని పంక్తిక్రమంలోనే సేవించి అర్థన్ని చెప్పడం, వినడం అనే పద్ధతి నిరంతరంగా కొనసాగుతూ వచ్చింది. అయితే, ఈ కాలంలో ఆ పద్ధతి చాలా చాలా విరళమైపోయింది. ఉపన్యాసాలు, చెప్పడం వినడం మాత్రమే ప్రచురంగా అలవాటు పడిపోయినందున, పూర్వాచార్య శ్రీ సూక్తులలోని గంభీరమైన అర్థాలను తెలిసినవారు చాలా తక్కువైపోయారు.

పూర్వాచార్యులు తాము దివ్య గ్రంథాలలో అరుదైన గొప్ప శాస్త్రార్థాలను నిక్షిప్తం చేసేటట్లే, చమత్కారమైన లౌకిక వార్తలను కూడా ప్రస్తావన చేయడం ఉన్నది. వాటిలోని అర్థాలు కూడా ఉపదేశ గమ్యాలే తప్ప, గ్రంథాలను చూచి తెలుసుకోవడానికి సాధ్యమైనవి కానే కావు. ఈ వ్యాఖ్యానాలకు ముందే కొందరు అరుంబద వివరణలు రచించారు. అవి ముద్రింపబడ్డాయి కూడా. వాటిని చూచేటప్పుడు, ఆ అరుంబద వివరణకారులు కూడా కొన్నిచోట్ల సదాచార్య పరంపరలో శ్రవణం

చేసినవారు కాదు కాబోలు! అని భావించవలసి వస్తుంది– అని ఒక సమయం కోయిల్ పత్తరావి స్వామి చెప్పగా విన్నాను. కూడా. ఆ స్వామి తెలిపిన ఒక విషయాన్ని ఇక్కడ ప్రస్తావిస్తాను.

పెరియ తిరుమొழி ప్రబంధంలో (5–6–2) " తిరుత్తణ్ కాల్ ఊరానై కరంబనూర్ ఉత్తమనై" అనే చోట పెరియ వాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానంలో " (కరంబనూర్ ఉత్తమనై) వழிక్కరైయిలే తిరువాశలక్కు ఓరు కదవిడాదే వందు కిడక్కిఱవనై" అని చెప్పబడింది. శ్రీరంగం సమీపంలో ఉత్తమర్ కోయిల్ అనే ఒక దివ్యదేశం ఉన్నది కదా. ఆ దివ్యదేశానికే తిరుక్కరంబనూర్ అని పేరు. అక్కడ భగవంతుడు ఉత్తమన్ అనే పేరుతో వేంచేసి ఉండడాన్ని రసోక్తిగా నిర్వహిస్తూ అర్థాన్ని పలుకుతున్నారు, పెరియ వాచ్చాన్ పిళ్లై. ఎవరికి ఏ సమయంలోనూ దర్శనాన్ని అనుగ్రహించని స్వామి, అధముడు. చాలా శ్రమతో దర్శనాన్ని ఇచ్చే స్వామి, మధ్యముడు. అనాయాసంగానే దర్శనాన్ని అనుగ్రహించే స్వామి, ఉత్తముడు –అనే ఈ విధంగా ఉండే భేదాన్ని దృష్టిలో పెట్టుకొని, పెరియ వాచ్చాన్ పిళ్లై పైన ప్రస్తావించిన శ్రీ సూక్తిని అనుగ్రహించారు. తిరుక్కరంబనూరులో ఉండే స్వామి వెదకి దర్శించవలసిన ఆవశ్యకత లేకుండా, దారి తీరంలోనే ఉండడం ఒక సౌలభ్యం. అంతకుమించి, సన్నిధివాకిలికి తలుపులు పెట్టకుండానే ఉండడం సౌలభ్యాతిశయం. పెరియ వాచ్చాన్ పిళ్ళై కాలంలో ఈ సన్నిధికి ధనలోపంచేత తలుపులు పెట్టబడకుండా ఉండేది. అంతకు ముందు ఉండే తలుపు పాడైపోయింది. మళ్లీ తిరిగి తయారు చేయడానికి ధనం లేకపోయింది. దానిని

ఐశ్వర్యంలోని కొరత అని గ్రహించకుండా, సౌలభ్య గుణంలోని చరమకాష్ఠకు అనుగుణంగా అన్వయించి పెరియవాచ్చాన్ పిళ్లై విలక్షణమైన చాతుర్యంతో పలుకుతున్నారు. లోకంలో ప్రభువులు తమ భవనాల లోపల అనేకకవాటాలను పెట్టి, వాటికి తాళాలను బిగించి, ఎవరికంటికి కనబడకుండా ఉండడం, ఎవరైనా అర్థులు వస్తే, " నిద్రాతి స్నాతి భుంక్తే చలతి కచభరం శోషయత్యంతరాస్తే, దీవ్యత్యక్షైః న చాయం గదితు మవసరో భూయ ఆయాహి యాహి (నిద్రపోతున్నాడు, స్నానం చేస్తున్నాడు, భోజనం చేస్తున్నాడు, ఎక్కడికో వెళుతున్నాడు, జుట్టును ఆరబెట్టుకుంటున్నాడు, ఇంటి లోపల ఉన్నాడు, జూదం ఆడుతున్నాడు, ఈ విషయాన్ని చెప్పడానికి ఇది సమయం కాదు, ఇప్పుడు వెళ్ళిపో, మళ్లీ రా) అని అంటూ గెంటి వేయడానికి వాకిలిలోపల తలుపులను పెట్టి, ఈ విధంగా తమ దుర్గణాలను వ్యక్తం చేస్తూ ఉంటారు. కానీ, కరంబనూర్ దివ్యదేశంలో ఉండే స్వామి ఆ విధంగా కాకుండా, వాకిలికి తలుపు కూడా పెట్టకుండా, దారి చేరువలోనే వేంచేసి ఉండి, అనాయాసంగా దర్శనాన్ని అనుగ్రహించే సౌలభ్య గుణం ఏమి ఆశ్చర్యకరం! అని అంటూ చాలా అభినివేశాన్ని పొందుతూ, ఈ గుణాతిశయంవల్లనే ఉత్తమన్ అని పేరు వచ్చింది– అని తెలియజేస్తూ, చాలా మధురంగా ఇక్కడ పంక్తులను అనుగ్రహించారు, పెరియ వాచ్చాన్ పిళ్ళై.

ఈ సందర్భంలో అరుంబద వివరణ కారులు ఏమి వ్రాశారు? అని అంటే, "ఎల్లారుమ్ నడక్కుమ్ వழி యాకైయాలే సేవిప్పార్ మికుకైయాలే కదవిడ అవసరమిల్లై –ఎన్ను కరుత్తు" (అందరూ నడిచి వెళ్లే దారి

అయినందున, ఆ స్వామిని దర్శించే వారు అధికంగా ఉండడం చేత, తలుపులు పెట్టవలసిన ఆవశ్యకత లేకుండా పోయింది –అని భావం) అని వ్రాశారు. ఈ వివరణలో ఏ విధమైన మాధుర్యం లేదు. పెరియ వాచ్చాన్ పిళ్లై అభిప్రాయాన్ని అనుసరించిన వివరణ కూడా కాదు, ఇది. దర్శించే వారి ఆధిక్యంచేత తలుపులు పెట్టవలసిన ఆవశ్యకత లేదు– అనే రీతిలో స్థితి కరంబనూరుకు సంభవించే అవకాశం లేదు. ఈ విధంగా పలు పలు విషయాలు ప్రస్తావించి చెప్పవలసినవి ఉన్నాయి. అరుంబద వివరణ కారుల విషయంలో ఉండే పక్షపాతం కారణంగా కొందరు వారు చూపించిన అర్థం మంచిది అని చెప్పడానికి ముందుకు వచ్చినట్లయితే, దానికి నేను ప్రతివాదం చేయడానికి సిద్ధంగా లేను. కీర్తి మూర్తి అయిన కోయిల్ పత్తరావి స్వామి పూర్వులు అనుగ్రహించిన విషయాన్ని చెప్పగా, దానిని వారి వద్ద నేను శ్రవణం చేసి, ఇక్కడ తెలియజేశాను, అంతే.

"శ్రీకృష్ణుడు దూతగా వెళ్ళాడు" అనే గుణవిశేషంలో అభినివేశాన్ని పొంది, ఆచార్యులు వివరణను అనుగ్రహించే సందర్భంలో " క*ழு*త్తిలే ఓలై కట్టి త్తూదుపోనవన్" అని అనుగ్రహించారు. ఈ పంక్తులను పెరియ తిరుమొ*ழி* (2–2–2) పాశుర వ్యాఖ్యానంలోనూ, " మహాభారతత్తాలే తూదుపోనవనన్ ఏ*ற்ற*మ్ శొల్లుకిఱదు" అనే శ్రీవచనభూషణ శ్రీసూక్తి వ్యాఖ్యానంలోనూ, ఇంకా మరి కొన్ని సందర్భాలలోనూ గమనించవచ్చు. కంఠంలో పత్రాన్ని కట్టుకొని, దూతగా పోవడం అంటే ఏమి? అని పలువురు ప్రశ్నిస్తారు. సమీప కాలంలో ఒక పండితుడు దీనికి ఏమని వివరిస్తూ ఉపన్యాసం చెప్పాడంటే, "ఏకాంతంగా

దూతగా వెళ్లకుండా, "నేను దూతగా వెళుతున్నాను, చూడండి" –అని ఒక పత్రంలో వ్రాసి, తన కంఠంలో వేలాడదీసికొని వెళ్ళాడు– అని ఉపన్యాసం చెప్పాడు. ఇది సరి అయిన అర్థం కాదు కదా.

పూర్వకాలంలో, అంటే, తపాలా సౌకర్యాలు లేని కాలంలో, ఆవశ్యకంగా కొన్ని కార్యాలకు తపాలాను పంపించడంకోసం, వెంటనే సమాధానాన్ని తెలుపడంకోసం, తెలుసుకోవడంకోసం, ఒక కుక్కను పెంచేవారట. దానికి కొంతమంది బంధువులతో, స్నేహితులతో పరిచయం కలిగేటట్లు చేసేవారట. ఆవశ్యకత ఉండే సమయాలలో, ఒక పత్రంలో సమాచారాన్ని రాసి, ఆ పత్రాన్ని కుక్క మెడలో కట్టి, కుక్కను విడిచి పెట్టేవారట. వెంటనే ఆ కుక్క వెళ్లి నిర్దేశించిన ఊరుకు పోయి అక్కడ ఆ స్నేహితుల, లేదా, బంధువుల ముందు నిలుచునేదట. వారు దాని రాకను గుర్తించి ఆ కుక్క మెడలో కట్టబడి ఉండే పత్రాన్ని తీసుకొని చూచి, సమాచారాన్ని తెలుసుకొని, బదులు రాసి మళ్ళీ ఆ కుక్క మెడలోనే కట్టి, దానిని విడచి పెట్టేవారట. ఆ కుక్క తిరిగి వచ్చి యజమానికి ఆ పత్రాన్ని అందించేది. ఈ విధంగా తపాలా రాకపోకల విధానం ఒకటి పూర్వకాలంలో నడుస్తూ వచ్చేది. ఈ విధంగా కుక్క చేసే పనిని శ్రీకృష్ణుడు తన వృత్తిగా గ్రహించి దూతగా పోయాడే! అని ఆచార్యులు మనసులో ద్రవించి వ్రాసిన క్రమం ఇది. దూతగా వెళ్లేటప్పుడు శ్రీకృష్ణుడు తన కంఠంలో పత్రాన్ని కట్టుకొని వెళ్ళాడని ఇక్కడ అర్థం కాదు. ఉపమానరీతిలో వ్రాయబడిన పంక్తి ఇది. కుక్క కంఠంలో పత్రాన్ని కట్టబడగా, అది వెళ్లడం అనేది ఉంది కదా. అటువంటి చాలా హీనమైన జంతువు చేసే కార్యాన్ని అయ్యో!

పరాత్పరుడు చేశాడే! ఆహ్! అని ఇంతటి అర్థం స్ఫురించేటట్లుగా " కమ్రుత్తిలే ఓల్లై కట్టి త్తూదు పోన ఏఱ్ఱమ్" అని అంటూ ఈ అర్థాన్ని సంగ్రహంగా మన పూర్వాచార్యులు రాశారు. ఇటువంటి పంక్తులు మన సంప్రదాయ గ్రంథాలలో వందల కొలది ఉన్నాయి. పూర్వకాలంలో ద్రావిడ పండితులు ఎంతో ఆశ్చర్యకరంగా వ్రాశారు అని చెప్పడం ఉన్నది. వారి గ్రంథాలలో కూడా ఇటువంటి శబ్ద సందర్భాల అతిశయం మనకు గోచరించదు. మన పూర్వాచార్యుల వాగ్వైభవం చాలా విలక్షణమైనది.

# పరత్వమ్

(తిరువాయ్ మొழி ప్రబంధంలోని మొదటిశతకంలోని సారం)

(తిరునాంగూర్, ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్య స్వామివారి ద్రావిడవ్యాసానికి అనువాదం)

ఈ స్వామివారు శ్రీపెరుంబూదూర్ మహావిద్యాలయంలో 12 సంవత్సరాల కాలం న్యాయం, వ్యాకరణం, మీమాంస, వేదాంతం అనే ఈ నాలుగు శాస్త్రాలను పరిపూర్ణంగా అధ్యయనం చేశారు. తమ తండ్రిగారైన తిరునాంగూర్ శ్రీకృష్ణమాచార్య స్వామివారి సన్నిధిలో ముముక్షుప్పడి, భగవద్విషయం మొదలైన సంప్రదాయ గ్రంథాలను కాలక్షేపం చేశారు. న్యాయంలో ఉత్తరవాదాలను, ఆ విధంగానే, శ్రీ భాష్యశ్రుతప్రకాశిక, శ్రీవచనభూషణం మొదలైన గ్రంథాలను శ్రీపెరుంబూదూర్ శ్రీ ఉ. వే. మహా విద్వాన్ ఆసూరి పెరియ రామానుజాచార్య స్వామివారి సన్నిధిలో సేవించారు. తరువాత, ఆ విద్యాలయంలోనే రెండు సంవత్సరాల కాలం ఉపాధ్యాయులై ఉన్నారు. తరువాత గుజరాత్ రాష్ట్రంలో ఉండే వడ్తాల్ అనే నగరంలో వీరు సత్యనారాయణ సంస్కృత మహా విద్యాలయంలో ప్రధానాచార్యులై, 25 సంవత్సరాల కాలం న్యాయవేదాంతాలను ప్రవచనం చేశారు. తరువాత శ్రీరంగంలో కువల కుడి శ్రీ సింగమయ్యంగార్ స్వామి పాఠశాలలో ఒకటిన్నర సంవత్సరకాలం శ్రీ భాష్య కాలక్షేపాన్ని నిర్వహించారు. తరువాత అయోధ్యలో శ్రీరామానుజ సంస్కృత మహా విద్యాలయంలో రెండు సంవత్సరాల కాలం ప్రధానాచార్యులై ఉండి, శ్రీ భాష్యం మొదలైన వేదాంత గ్రంథాలను ప్రవచనం చేసి, పలువురను

శీభాష్యాధికారులుగా తీర్చిదిద్దారు. తరువాత, బృందావనంలో ఈ రంగజీ మందిరంలో దేవస్థాన విద్వాన్ గా ఆ దేవస్థానాధికారుల చేత నియమింపబడి, 8 సంవత్సరాల కాలం శ్రీ భాష్య భగవద్గీత గ్రంథాలను ప్రవచనం చేశారు. భగవద్యామునులు అనుగ్రహించిన సిద్ధిత్రయానికి, చోళసింహపురం దొడ్డయాచార్యస్వామివారి ప్రథమ శిష్యులైన శ్రీనివాసాచార్య స్వామివారు అనుగ్రహించిన యతీంద్రమత దీపికకు సంస్కృత భాషలోనే వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు.

★★★★★★

భక్తామృతం విశ్వజనానుమోదనం
సర్వార్థదం శ్రీ శఠకోపవాఙ్మయమ్,
సహస్రశాఖోపనిషత్సమాగమం
నమామ్యహం ద్రావిడవేదసాగరమ్.

(భగవద్భక్తులకు అమృతంవంటిది, లోకంలోని అందరిజనులకు ఆనందాన్ని కలిగించేది, అన్ని అర్థాలను ఇచ్చేది, సామవేదంలోని వేయి శాఖల సమాగమరూపమైనది, నమ్మాళ్వారుల వాఙ్మయమైన తిరువాయ్ మొల*ఝి* ప్రబంధం అనే ద్రావిడవేదసాగరాన్ని నమస్కరిస్తున్నాను.)

వకుళాభరణం వందే జగదాభరణం మునిమ్,
యః శ్రుతే రుత్తరం భాగం చక్రే ద్రావిడ భాషయా.

(వేదంలోని ఉత్తరకాండమైన ఉపనిషత్తులలోని అర్థాన్ని ద్రావిడభాషలో అనుగ్రహించినవారు, లోకానికి అంతటికి అలంకారంవంటివారైన నమ్మాళ్వార్లను నమస్కరిస్తున్నాను)

శ్రీమన్నారాయణునిచేత అనుగ్రహింపబడిన శ్రీశఠకోపులచే కృపచేయబడిన తిరువాయ్ మొழి ప్రబంధం "ద్రావిడవేద సాగరమ్" అని, " పాలేయ్ తమిழ் ఇశైకారర్ పత్తర్ పరవుమ్ ఆయిరమ్" (పాలవలె మధురమైన తమిళభాషలో పండితులు, గాయకులు, భక్తులు కీర్తించే వేయి పాశురాలు) అని కీర్తింపబడుతున్నది. సాగరం రత్నాకరం అని చెప్పబడుతున్నది. శ్రీ శఠకోపవాఙ్మయం కూడా పరమార్థరత్నాకరమే. "మற்றెల్లామ్ పేశిలుమ్ ఎన్నిఅపడియే అఱియవేండుమ్ అర్థమెల్లామ్ ఇదుక్కుళ్ళే యుండు" (మిగిలినవి అన్నిటినీ చెప్పినప్పటికీ "అనే విధంగా తెలియవలసిన అర్థాలన్నీ ఇందులో ఉన్నాయి) అనే విధంగా ముముక్షువులు తెలియవలసిన అర్థపంచకం తిరువాయ్ మొழி ప్రబంధంలో ప్రతిపాదింపబడింది. ఇది పెరియవంగిపురత్తు నంబి చేసిన నిర్వాహం. పన్నీరాయిరప్పడి వ్యాఖ్యానంలో " ప్రాప్యస్య బ్రహ్మణో రూపం ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః" ఎన్నిఅ పడి ముదల్ ఇరండు పత్తు ప్రాప్యస్వరూపపరమ్" (పొందదగినవాడైన పరమాత్మ యొక్క స్వరూపం, ఆ పరమాత్మను పొందే జీవుని స్వరూపం– అనే విధంగా మొదటి రెండు శతకాలుప్రాప్యస్వరూప పరం) అని వాదికేసరి అழగియ మణవాళ చ్చీయర్ నిర్వహించారు. ద్వయమంత్ర వివరణం తిరువాయ్ మొழி ప్రబంధం– అని నంబిళ్ళై మొదలైన మన పూర్వాచార్యులు ముఖ్యంగా

నిర్వహించారు. ఆళ్వార్లు దీర్ఘచింతయంతి అని, తిరువాయ్ మొழி శ్రీరామాయణంవలె దీర్ఘ శరణాగతి అని మన పూర్వాచార్యులు అంటారు.

శ్రీపిళ్లై లోకాచార్యులవారు సారసంగ్రహం అనే గ్రంథంలో మంత్రరత్నంలో ఉండే ఆరు పదాల అర్థంగా 1) శ్రియఃపతిత్వం, 2) నారాయణత్వం, 3) సర్వ శరణ్యుడు అయిన ఆ స్వామి చరణారవింద యుగళం, 4) దాని ప్రాపకత్వం, 5) తద్గోచరంగా జీవుడు చేసే ప్రార్థనాగర్భవిస్రంభమైన శరణాగతి, 6) మిథునంలో కైంకర్య ప్రతిసంబంధిత్వం, 7) నిరతిశయ భోగ్యత్వం, 8) సర్వస్వామిత్వం, 9) నిత్య కైంకర్యం, 10) కైంకర్య ప్రతిబంధక విశేష నిబర్హణం అనే భగవంతుని 10 గుణాలు– అని అనుగ్రహించారు. వారి అనుజులైన అழగియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ భగవంతుని పది అవతారాల వలె, తిరువాయ్ మొழிలోని 10 శతకాలలో భగవంతుని పరత్వం మొదలైన 10 గుణాలను అర్థంగా అనుగ్రహించారు. అవి ఏవి అంటే, 1) పరత్వం, 2) కారణత్వం, 3) వ్యాపకత్వం, 4) నియంతృత్వం, 5) కారుణికత్వం, 6) శరణ్యత్వం, 7) శక్తత్వం, 8) సత్యకామత్వం, 9) ఆప్తసఖత్వం, 10) ఆర్తిహరత్వం అనేవి. అన్ని శతకాలలోనూ అన్ని గుణాలు ప్రతిపాదింపబడినప్పటికీ, ఒక్కొక్క శతకంలో ఒక్కొక్క గుణంలో దృష్టి అని వారి అభిప్రాయం. అందులో, మొదటి శతకంలో, భగవంతుని పరత్వాన్ని ముఖ్యంగా అనుభవించారు.

ఆరంభంలోనే " అయర్ వఱు మమరర్ కళ్ అదిపతి" (విస్మృతి లేని అధిపతి) అని "నిత్య సూరులకు నిర్వాహకుడు పరుడు" అని

భగవంతుని పరత్వాన్ని తెలియజేశారు. సర్వాధికమైన పరతత్వానికి అసాధారణమైన లక్షణం– అనవధికాతిశయ అసంఖ్యేయ కళ్యాణ గుణగణాలను కలిగినవాడై ఉండడం. దానిని "ఉయర్ వఱ ఉయర్ నలమ్ ఉడైయవన్ యవన్ అవన్" (తమకంటే గొప్పవి లేనందువల్ల చాలా గొప్పవి అయిన ఆనందాది కళ్యాణ గుణాలను సహజంగా కలవాడు) అని అన్నారు. నిత్యసూరి నిర్వాహకత్వరూపమైన పరత్వాన్ని మొదట చెప్పి, తరువాత కళ్యాణ గుణాలను చెప్పవలసి ఉన్నప్పటికీ, పరబ్రహ్మమైన పరతత్వం నిర్గుణం అని చెప్పే మాయవాదుల మతాన్ని ఖండించి, వారి కంఠాన్ని పట్టుకున్నట్లుగా "ఉయర్ వఱ ఉయర్ నలమ్ ఉడైయవన్ యవన్ అవన్" (అని ఆళ్వారులు అనుగ్రహించారే! అని కూరేశులు చాలా అభినివేశాన్ని పొందారని ఐతిహ్యం. భగవంతునకు ఉత్ అని ఒక అసాధారణమైన తిరునామం ఉన్నది. "తస్య ఉదితి నామ" అని ఛాందోగ్యమ్ (2) నిరస్త నిఖిలహేయుడు. హేయ ప్రతిభటుడు– అని అర్థం. "ఉయర్ వఱ" అని ఉకారంతో ఆరంభించి, ఉయర్ స్దే" అని తకారంతో ముగించినందున, ఉద్గీథ సామానికి అంతరార్థమై, నిఖిలహేయప్రత్యనీకుడై, స్వాభావికమైన లెక్కలేనన్ని కళ్యాణ గుణాలతో కూడినవాడై ఉండే పరమ పురుషుడే తిరువాయ్ మొழி ప్రబంధంలో కీర్తింపబడిన పరతత్వం అని ప్రకాశిస్తున్నది. హేయప్రత్యనీకునిలో సకల కళ్యాణ గుణాలు సహజంగానే తాముగానే వచ్చి చేరుతాయి.

ఆళ్వారు భగవంతుని పరత్వాన్ని తిరువాయ్ మొழி ప్రబంధంలో" ఉయర్, తిణ్, అణై, ఒన్డుమ్"నే నాలుగు దశకాలలో

అనుగ్రహించారు. అందులోనూ మొట్టమొదటి దశకంలో, పరత్వంలో పరత్వాన్ని అనుగ్రహించారు. మొదటి దశకంలో పరమ పురుషుడైన సర్వేశ్వరుడు యోగజ్ఞాన గమ్యమైన పరిశుద్ధ ఆత్మ స్వరూపం కంటే, ఇంద్రియజన్య జ్ఞానవిషయమైన ప్రాకృత శబ్దాది విషయాలకు ఆశ్రయమైన అచిత్తు కంటే విలక్షణుడై, " ఆనందమయః ", "ఉయర్ ముఴనలమ్" అని పూర్తిగా జ్ఞానానంద స్వరూపుడై, కాలత్రయంలోనూ తనతో సమానమైనవారు, మించినవారు ఎవరు లేనివాడై ఉంటాడు. రాబోయే కాలం, వర్తమాన కాలం, జరిగిన కాలం– అనే మూడు కాలాలలోనూ సాటి వచ్చేవారు, మించినవారు ఎవరు లేనివాడైన మహాశ్చర్యభూతుడు. ఇది కూడా పరత్వ లక్షణం అవుతుంది. భగవద్రామానుజులు "స్వాధీన త్రివిధ చేతనా చేతన స్వరూప స్థితి భేదమ్" అని భగవంతుని విశేషించి పలికారు బద్ధముక్త నిత్యులనే చేతనులను, కాల, పాద, త్రిపాద్విభూతి రూపమైన అచేతనాలను అన్ని కాలాలలోనూ తనకు అధీనంగా కలవాడై, వాటిని నిర్వహించేవాడే పరతత్వం అవుతాడు. "నామవన్, అవరవర్, నిన్ఱనర్. " అనే మూడు పాశురాలలోనూ ఈ పరత్వగుణాన్ని ఆళ్వారులు అనుగ్రహించారు.

తిడా విశు మ్బెరివళి నీర్ నిలమివై మిశై
పడర్ పొరుళ్ ముఴవదుమాయ్ అవైయవై దొఱుమ్
ఉడన్ మిశై ఉయిరెన కరందెంగుమ్ పరందుళన్
శుడర్ మికు శురిదియుళ్ ఇవై యుండ శురనే
(తిరువాయ్ మొఴి– 1–1–7)

(దృఢమైన ఆకాశం అగ్ని వాయువు జలం భూమి అనే వీరిని ఆధారంగా కలిగి వ్యాపించి ఉండే పదార్థాలు అన్నీ తానే అనేటట్లుగా వాటికి ఉపాదాన కారణమై వాటిని సృష్టి చేసి ఆయా పదార్థాలు అన్నిటిలోనూ, శరీరంలో ఆత్మ మరుగుపడి వ్యాపించేటట్లు, మరగుపడి, లోపల బయట వ్యాపించి, గొప్పగా ప్రకాశించే వేదంలో ఉండే భగవంతుడు సంహారకాలంలో వీనిని అన్నిటిని తనలో ఉంచుకొనే దేవుడు)

అనే పాశురం చాలా ముఖ్యమైనది. "ఇవై యుండ శురన్"– "యస్య బ్రహ్మ చ క్షత్రం చ" (ఎవనికి బ్రాహ్మణులు, క్షత్రియులు అన్నం అవుతున్నారో) అనే విధంగా సర్వసంహర్త, సర్వేశ్వరుడు. అతడే పంచభూత భౌతికరూపమై రూపాన్ని కలవాడై, రూపం లేనివాడై ఉన్నప్పటికీ, వాటికంటే విలక్షణమైనవాడు. "ఉళన్ శుడర్ మికు శురిదియుళ్" (మిక్కిలిగా ప్రకాశించే వేదంలో ఉన్నాడు) అని అంటున్నారు, ఆళ్వారులు. అపౌరుషేయమై, నిత్యనిర్దుష్టమై, బాహ్య కుదృష్టి సిద్ధాంతాలచే అవిచాల్యమై, మిక్కిలి తేజస్సును కలిగినదై ఉండే వేదంచేతనే వేద్యుడు ఇతడు –అని అంటున్నది ఈడు వ్యాఖ్యానం. "శురుది " అని అభేద శ్రుతి, "మికు శురుది "అని భేద శ్రుతి, "శుడర్ మికు శురుది "అని అంతర్యామి బ్రాహ్మణం వివక్షితం అని కొందరు అంటారు. శరీర శరీరిభావ సంబంధంచేత అంతా బ్రహ్మమే అని " సర్వం ఖలు ఇదం బ్రహ్మ" అనే శ్రుతి చెబుతున్నది. "శురరరటి వరునిలై "అనే పాశురంలో "వరన్ ముదలాయవై ముఱ్ఱుదుండ పరపరన్" (పదార్థాలకు శ్రేష్ఠకారణమైనవాడై, వానిని అన్నిటినీ తన బొజ్జలో ఉంచుకొని

కాపాడినవాడు అయిన పరమ పురుషుడు) – సర్వ సంహర్తయై సర్వస్రష్టయై, సర్వాంతర్యామియై ఉండే సర్వేశ్వరుడే పరపరుడు అని అంటున్నారు. సర్వ సృష్టి లయ కారణంగా ప్రసిద్ధుడైన, బ్రహ్మ రుద్రాదులకు కూడా అంతర్యామియైన నారాయణుడే "పురమొరు మూన్టెరిత్తు, అమరర్ క్కుమ్ అఱివియందు ఆరనయనెన ఉలగ౨ళిత్తమైత్తుళనే" (రుద్రస్వరూపుడై సాటిలేని త్రిపురాలను దహించి లోకాన్ని సంహరించి బ్రహ్మయై దేవతలకు జ్ఞానాన్ని ఇచ్చి లోకాన్ని సృష్టించి ఉన్నాడు, అంటే, బ్రహ్మరుద్రులకు అంతర్యామిగా ఉన్నాడు) అని అంటున్నారు. "యదస్తి యన్నాస్తి చ విప్రవర్య" స్థూల సూక్ష్మ పదార్థాలన్నీ భగవంతుడే) విష్ణుపురామ్), "సదసచ్చాహ మర్జున" (భగవద్గీత) అనే విధంగా సత్వంవలె అసత్వం కూడా భావరూపమైన స్వభావమే. స్థూలసూక్ష్మ రూపమైన ఈ అవస్థలను కలవాడు, సర్వేశ్వరుడు. సూక్ష్మ చిదచిద్విశిష్టుడైన పరమ పురుషుడే కారణమై, ఉన్నాడు, స్థూల చదచిద్విశిష్టుడైన పరమ పురుషుడే కార్యమై, జగద్రూపమై ఉన్నాడు అని "ఉళ నెన ఇలనెన ఇవై గుణముడైమైయిల్, ఉళన్ ఇరుతకైమైయోడు ఒ౨ళివిలన్ పరందే" (ఈ అస్తిత్వ నాస్తిత్వాలను పకారాలుగా కలిగి ఉండడం చేత, రూపాన్ని కలిగినవిగాను, రూపాన్ని లేనివిగాను ఉండే జగత్తులోని వస్తువులను అన్నిట ఆ జీవుని స్థూల శరీరాలు, సూక్ష్మ శరీరాలు అవుతున్నాయి. స్థూల సూక్ష్మ ప్రపంచం అనే రెండు రూపాలను కలిగిన పరమాత్మ ఎల్లప్పుడూ అంతటా ఉన్నవాడునే సిద్ధిస్తున్నది) (తిరువాయ్ మొ౨ళి–1–1–9) అని విశిష్టాద్వైత

సిద్ధాంతాన్ని ఇతర మతాలను నిరసించి, స్థాపించారు. సర్వం ఖలు ఇదం బ్రహ్మ తజ్జలాన్ "అనే శ్రుతిలోని అర్థం ఇదే. "అణో రణీయాన్ మహతో మహీయాన్" (అణువు కంటే అణువైనవాడు, గొప్ప వస్తువు కంటే గొప్పవాడు) అనే శ్రుతి పరతత్వం అణువుల కంటే పరమాణువై, పెద్దదైన వస్తువు కంటే చాలా పెద్దదై ఉంటుందని తెలుపుతున్నది. " పరంద తణ్ పరవైయుళ్ " అనే పాశురంలో " కరందెంగుమ్ పరందుళన్ ఇవై యుండ శురనే" (ఆ వ్యాప్యవస్తువులకు తెలియకుండా లోపల ఉండి, అంతటా వ్యాపించి ఉన్నాడు. అతడు ఎవరంటే, ఈ వస్తువులను అన్నిటిని సంహార దశలో తనలో ఉంచుకొని, తాను స్థిరంగా ఉండే స్వామి) అని అంటూ అణువులలో కూడా అంతర్యామిగా అంతటా వ్యాపించి ఉన్నాడు– అని అనుగ్రహించారు. ఈ సందర్భంలో ఈడు వ్యాఖ్యానం " విభుత్వాన్ని పరమాత్మకు చెప్పి, అణుత్వాన్ని ఇతనికి చెప్పి, ఇతని లోపల అతడు ఏ లోటు లేకుండా వ్యాపించి ఉంటాడు– అనేది సరిపోతుందా? అని అంటే, " ఇవై ఉండ శురనే" – చిన్న రూపాన్ని పరిగ్రహించి, పెద్ద వస్తువులను అన్నిటినీ తన కడుపులో పెట్టుకుంటే, ––––– ఆ తరువాత కూడా ఆ కడుపే చాలా అవకాశం ఉండే రీతిలో ఉండగలిగిన సర్వశక్తి చిన్న వస్తువులు ఏ లోటు లేకుండా ఉండలేడా ?అని అన్నారు. " శురన్" – ఈ విధంగా సుదృఢప్రమాణ సిద్ధుడు. "శ్రుతేస్తు శబ్దమూలత్వాత్" అని అర్థం. " రసో ఽహ మప్సు కౌంతేయ" (గీత) (అర్జునా! జలంలో నేను రసమయి ఉన్నాను) అనే విధంగా పంచభూతాలకు అసాధారణమైన శబ్దాతిగుణాలకు నిర్వాహకుడై, పరుడై ఉండేవాడు, సర్వేశ్వరుడు అని.

"వరనవిల్ తిఱల్ వలి ఆళి పొఱైయాయ్ నిన్ఱ పరన్" (తిరువాయ్ మొழி–1–1– 11) (గొప్ప శబ్దాలు, దాహక శక్తి, బలం, చల్లదనం, క్షమ అనే ఈ గుణాలను తన స్వాధీనంలో కలిగిన సర్వేశ్వరుడు) అని అనుగ్రహించారు. ఈ విధంగా పరత్వంలో పరత్వాన్ని మొదటి శతకంలో ఉండే మొదటి దశకంలో ఆళ్వారులు అనుగ్రహించారు.

"ఉపక్రమ ఉపసంహారౌ, అభ్యాసః" అని ఆఱు విధాలైన తాత్పర్య లింగాలను మీమాంసకులు నిరూపిస్తున్నారు. ఉపక్రమంలో మొదటి దశకంలో పరత్వనిరూపణ ప్రకారాన్ని నిరూపించారు. ఉపసంహారంలో మొదటి శతకంలోని దశమ దశకంలో కూడా " ఉమ్బర్ వానవర్ ఆదియమ్ శోదియై" అని అంటూ ఆది అయిన అందమైన, జ్యోతిస్స్వరూపుడైన పరతత్వాన్ని అనుగ్రహించారు.

మొదటి శతకానికి పరత్వంలో దృష్టి అనేదానికి అభ్యాసం అనే గుర్తు కూడా ఉన్నది. అభ్యాసం అంటే మాటిమాటికి ఒకే అర్థాన్ని చెప్పడం. ఆచార్య హృదయంలో నాయనార్ " వళవేழ்ఉలకిన్ ముదలాయ వానో రిఱైయై" (వైశాలి అన్ని కలిగిన ఏడు లోకాలకు ఆదికారణమైనవాడైన నిత్యసూరినాథుడు), "ఎప్పాల్ యవర్ క్కుమ్ నలత్తాల్ ఉయర్ న్దు ఉయర్ న్దు అప్పాలవన్" (ఆ సర్వేశ్వరుడు అంతటా ఉంటాడు. ఆనంద గుణంతో మిక్కిలి ఉన్నతులై ఉండేవారికి అందరికి అందనివాడుగా ఉన్నాడు) " ఎవైయుమ్ యవరుమ్ తన్నుళ్ ఆగియుమ్ ఆక్కియుమ్ కాక్కుమ్ అవైయుళ్ తని ముదలమ్మాన్" (చేతనా చేతనాలను అన్నిటిని తనలో ప్రళయకాలలో ఉంచుకుంటాడు.

తరువాత సృష్టికాలంలో వాటిని సృష్టిస్తాడు. ఆ చేతనా చేతనాలకు అంతర్యామియై, సాటి లేని కారణభూతుడై ఉండే స్వామి) అని మొదటి శతకంలో అనేక సందర్భాలలో భగవంతుని పరత్వాన్ని అనుగ్రహించారు. ఇదే అభ్యాసం.

నిత్య సూరినిర్వాహకత్వంవలె జగత్కారణత్వం కూడా పరత్వ లక్షణంగా " యతో వా ఇమాని భూతాని జాయంతే –––తత్ బ్రహ్మ" (దేనినుండి ఈ ప్రాణులన్నీ పుడుతున్నాయో –––అదే బ్రహ్మం) అనే శ్రుతి లక్షిస్తున్నది.

భగవంతుడు అళ్వార్లకు భ్రమప్రమాదాది ఎటువంటి దోషం లేని జ్ఞానాన్ని అనుగ్రహించడానికి ముందు "అసన్నేవ స భవతి" అనే విధంగా తనను అసత్కల్పంగా భావించినందున నాకు భక్తిరూపాపన్న జ్ఞానాన్ని అనుగ్రహించాడు –అని చెప్పలేదు. " యానే ఎన్నై అఱియకిలాదే యానే ఎన్దనదే " (నేను నన్ను తెలిసికలేక, అహంకార మమకారాలను కలిగి ఉన్నాను) అని తాము ఉండడం భక్తిరూపాపన్న జ్ఞానాన్ని అనుగ్రహించడానికి ముందున్న స్థితి. ఆ జ్ఞానాన్ని అనుగ్రహించిన తరువాత ఏర్పడిన స్థితి ఏమంటే, " యానే నీ, ఎన్నుడమైయుమ్ నీయే" (నేనే నీవు– అనే విధంగా అభేదాన్ని కలిగి ఉన్నాను. నా సర్వస్వం నీ అధీనమే) అనే స్థితియే.

భగవంతుడు అళ్వార్లకు భక్తిరూపాపన్న జ్ఞానాన్ని అనుగ్రహించాడు. ఆళ్వార్లు పరమ కృపతో ఇతరుల అనర్థాన్ని చూచి సహించలేని స్వభావాన్ని కలిగినవారు కనుక, విముఖులైన సంసారులు

అందరు భక్తిరూపాపన్న జ్ఞానాన్ని పొంది, తరించేటట్లుగా కృపతో వేయి పాశురాలను పాడి, ఆ అరుదైన వేదంలోని అర్థాలను అన్నిటినీ సంశయ విపర్యయాది దోషాలు లేకుండా అనుగ్రహించారు. అందుచేత ఆళ్వార్ల కృపయే గొప్పది.

"శార్ న్ద ఇరు వల్వినైకళుమ్ శరిత్తు మాయై పఱ్ఱఱుత్తు తీర్ న్దు తన్ పాల్ మనమ్ వైక్క" (పెన వేసుకుని ఉండే బలమైన పుణ్య పాపాలను తొలగించి అజ్ఞానం వల్ల కలిగిన విషయ సంగంనుండి తప్పించి, తన పట్ల దృఢమైన అధ్యయవసాయంతో మనస్సును నిలిపేటట్లు నన్ను తీర్చిదిద్ది) అనే విధంగా భగవంతునిచేత సంస్కరింపబడి, సాటి లేని మహానంద ప్రవాహంలో మునిగిన మనసును కలిగినవారైన ఈ అళ్వార్లు సంసారులను సంస్కరించిన విధానం ఏమంటే, సర్వస్మాత్పరుడైన సర్వేశ్వరుడు "వణ్ పుకழ் నారణన్" (అంతులేని కళ్యాణ గుణాలను కలిగిన నారాయణుడు). సంసార బంధానికి హేతువైన "నేను, నాది" అనే అహంకార మమకారాలను " అసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా" (లౌకిక విషయాలతో సంబంధం లేకుండా చేసుకోవడం అనే ఆయుధంతో గట్టిగా ఖండించుకొని) అనే విధంగా ఆ సంగాన్ని అనే శస్త్రంతో సమూలంగా ఖండించుకొని, భగవంతుని చేరండి. భగవంతుని శ్రీచరణాలను ఆశ్రయించి, అనుసంధానం చేసుకోవడానికి తగిన మంత్రం పెరియ తిరుమంత్రమే. భగవంతుని మనం ఆశ్రయించటానికి వీలవుతుందా? అతడు చాలా గొప్పవాడు కదా! అని భయపడవద్దు. అతడు భక్తిని కలవారికి సులభుడు. "నిలవరంబిల పల పిఱప్పాయ్

ఎళివరుమియల్విననే" (నియతి లేని పలు విధాలయిన జన్మలను కలవాడై మొదలు చివర లేని సకల కళ్యాణ గుణాలు కలవాడై, పప్రకాశించేటట్లుగా సౌలభ్యమే స్వరూపంగా కలవాడైన) ఆ స్వామికి సంబంధించిన జ్ఞానంతో అతనిని తెలుసుకొని, లెక్కలేనన్ని కళ్యాణ గుణాలను కలవాడు అంతం ఆది లేని ఆ పరమాత్మను ప్రపత్తి మార్గంలో నిలచి, "ఇరు పశై యఋుత్తు" (ఇద్దరిలో కలిగే ఈశ్వర భ్రాంతిని తొలగించుకొని), ఆ స్వామిని ఆశ్రయించండి. స్వామిని ఆశ్రయించి, సేవించాలని ప్రయత్నం చేస్తే భజన విరోధులు తమకు తానే తొలగిపోతాయి. "కழிమిన్ తొండీర్ కళ్! కழிత్తు తొழுమిన్, అవనై త్తొழுదాల్ వழிనిన్ట వల్వినై మాళ్విత్తు అழிవిన్టు అక్కమ్ తరుమ్".

(భక్తులారా! విషయాంతర సంబంధాన్ని పోగొట్టుకోండి. దానిని పోగొట్టుకొని ఆ భగవంతుని ఆరాధించండి. ఆ విధంగా ఆరాధిస్తే, ఆ స్వామి, జన్మ పరంపరతో ఎడతెగకుండా వచ్చే ప్రబలమైన మన పాపాలను పోగొట్టి, నాశనం లేని ముక్తి సంపదను ప్రసాదిస్తాడు). భగవంతుని ప్రేమించడం వేప కషాయం వలె చేదుగా ఉంటుందని తొలగిపోకండి. అమృతం కంటే మిక్కిలి మధురంగా ఉండటం చేత అతని అనుసంధానం కూడా "ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్" అనే విధంగా చాలా మధురంగా ఉంటుంది. మన దోషాలను చూచి వెనుకంజ వేయవద్దు. "ఎన్ పిఞ్ఞాழ்త్తాళ్ తిరువడియిన్ తకవినుక్కు?" (నీ దయకు మించి, ఈమె ఏమి తప్పు చేసింది?) అనే విధంగా అతని క్షమ ప్రసిద్ధమైనది. అతని గొప్పతనాన్ని, మన తక్కువ

ధనాన్ని చూచి భయపడవద్దు. అతడు సుశీలుడు. మనలను స్వీకరించినందు వల్ల అతడు కీర్తిని పొంది, తనను ఉన్నవానినిగా భావిస్తాడు. "అతడు చాలా పెద్దవాడు, మనం అకించనులం. మనం అతనిని ఆశ్రయించడం వీలు కాదు"– అని భయపడవద్దు. ఆదరంతో, ప్రీతితో మనం సమర్పించే, అణువైన వస్తువు కూడా అతడు అలభ్యలాభంగా తలచి, స్వీకరించే పరిపూర్ణుడైనవాడు. "కుటిలురమైన మనం అతనిని ఆశ్రయించగలమా! "అని భయపడవద్దు. అతడు ఋజుస్వభావుడు. మన భావనకు తగినట్లుగా తనను మలచుకొని మనతో కలసి వర్తిస్తాడు. " ఓడుమ్ పుళ్ళేఱి చ్చూడుమ్ తణ్ తుழாయ్ నీడు నిన్రవై ఆడుమమ్మాన్". (అతడు, గరుత్మంతుడు మొదలైన నిత్యసూరులతో కూడి వ్యవహరించే స్వామి. పక్షిరాజు అయిన గరుత్మంతుని ఎక్కి వస్తాడు. చల్లని తులసీమాలను శిరస్సుపై ధరిస్తాడు) అయినప్పటికీ, "అతడు మనకు ఆశ్రయించటానికి సాధ్యమైనవాడా! " జన్మాంతరసహస్రేషు తపోధ్యానసమాధిభిః, నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తి ప్రజాయతే", (వేలాది జన్మలలో చేసిన తపస్సు, ధ్యానం, సమాధి అనే వీటివల్ల పాపాలను పోగొట్టుకున్న మానవులకు కృష్ణుని విషయంలో భక్తి కలుగుతున్నది) “బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే” (పలు జన్మల తర్వాత జ్ఞానాన్ని కలిగినవాడు నన్ను శరణాగతి చేస్తున్నాడు) అనే విధంగా అనేక జన్మలలో సంపాదించిన పుణ్యం వల్ల కదా అది సిద్ధిస్తుంది! అని భయపడవద్దు. విముఖంగా ఉండేవారికి చాలా దూరంలో ఉండేవాడుగాను, అనుకూల్యం, ఆశాలేశం కలవారికి సులభుడై

ఉండేవాడు. భక్తి కలవారికి పరిగణలోకి వచ్చేవాడు. అతడు, మన దశకు అనుగుణంగా మనం మెల్లిమెల్లిగా (సాత్మిక్క, సాత్మిక్క) అనుభవించటానికి వీలుగా ఉండేవాడు. అందుచేత సమస్త కళ్యాణ గుణాలను కలిగిన శ్రీమన్నారాయణుని శ్రీచరణాలను ఆశ్రయించి, హితాన్ని పొందడమే మంచిది – అని తిరువాయ్ మొழி ప్రబంధంలోని మొదటి శతకంలో అళ్వార్లు ఉపదేశించారు.

జగన్ కారణ వస్తువే పరతత్వం నారాయణుడే పరుడైనవాడు లక్ష్మీ వల్లభుడు గొప్పతనాన్ని కలిగిన స్వామి అతడు పాప పుణ్యాలనే రెండు విధాలైన కర్మలను తొలగించి అరుదైన ఫలమైన మోక్షాన్ని అనుగ్రహిస్తాడు. కోరిన దానిని అన్నిటినీ ఇచ్చే ఏ దోషం లేని ఉదారుడైన మణివర్ణుడు. శ్రియ పతిత్వం గరుడ వాహనత్వం శిరస్సులో తులసీమాలను అలంకరించుకోవడం, "పెరు మా నీళ్ పడై" అయిన సుదర్శన పాంచజన్యాలను ధరించడం పరత్వ చిహ్నాలు. ఈ విధంగా మొదటి శతకంలో నమ్మాళ్వారులు స్వాధీన త్రివిధ చేతనాచేతన స్వరూప స్థితి ప్రవృత్తికత్వమైన పరత్వే పరత్వాన్ని తాము అనుభవించి మనకు కూడా మనం అనుసంధించుకోవడం కోసం పరమ కృపతో ఉపదేశించారు. నారాయణుని దృఢమైన శ్రీచరణాలను ఆశ్రయించి సేవించి, నమస్కరించి సేవించడమే ఉజ్జీవించే మార్గం –అనేది మొదటి శతకంలోని ఉపదేశదశకంలోని సారం.

# అష్టాక్షరి –శారీరకమీమాంస

★★★★★★

"మంతారం త్రాయత ఇతి మంత్రః" అనే మంత్రశబ్దవ్యుత్పత్తివల్ల ఉపాసించేవానికి అనిష్టనివృత్తిని చేసి, ఇష్టప్రాప్తిని కలిగించేది మంత్రమని తెలుస్తున్నది. ప్రణవనమశ్శబ్దాలు అద్యంతాలలో కలిగిన ఏ నామమైనా మంత్రమని చెప్పదగినది అయినప్పటికీ, భగవన్మంత్రాలన్నిటిలో షడక్షరి, ద్వాదశాక్షరి, అష్టాక్షరి–అనే అనబడే విష్ణు, వాసుదేవ, నారాయణ మంత్రాలు ముఖ్యమైనవి. వీటిలో కూడా, అర్థపూర్తిని బట్టి, మహర్షి దివ్యసూరి, పూర్వాచార్యాది శిష్ట జనపరిగృహీతం అనే వైలక్ష్యణ్యాన్ని బట్టి, అంటే, మహర్షులు, అళ్వార్లు, నాథయామునయతివరాది పూర్వాచార్యులు మిక్కిలిగా ఆదరించిన కారణాన్ని బట్టి, మంత్రరాజం అనబడే అష్టాక్షరి మిగిలిన రెండు మంత్రాల కంటే ప్రధాన మంత్రంగా పరిగణింపబడుతున్నది. " ఋచో యజూంషి సామాని తథైవాధర్వణాని చ, –––సర్వ మష్టాక్షరాంతఃస్థం యచ్చాన్యదపి వాఙ్మయమ్" (ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదం అనే నాలుగు వేదాలు –––ఇంకా వాఙ్మయమంతా అష్టాక్షరిలో ఇమిడి ఉన్నది), " సర్వవేదాంత సారార్థః సంసారార్ణవ తారకః, గతి రష్టాక్షరో నృణా మపునర్భవకాంక్షిణామ్" (సమస్త వేదాంతసారమైనది, సంసార సముద్రం నుండి దాటించేది అయిన అష్టాక్షరి మోక్షాన్ని పొందగోరే వారికి గతి) అని మొదలైన అనేక ప్రమాణాలు అష్టాక్షరి సకల వేదాంత సంగ్రహం అని తెలుపుతున్నాయి.

వేదాంతవాక్యాలలో పైపైన తోచే అర్థంలోని వైరుధ్యాన్ని పరిహరించి, యథార్థతత్వ నిర్ణయం చేయడం కోసం బాదరాయణమహర్షి శారీరక మీమాంస అనే వ్యవహరింపబడే, నాలుగు అధ్యాయాల రూపమైన బ్రహ్మసూత్రాలను రచించారు. ఇవి సర్వశరీరి ఐన పరమాత్మకు సంబంధించిన విచారాన్ని చేస్తున్నాయి కనుక, శారీరక మీమాంస అనే పేరుతో పిలువబడుతున్నాయి. మొత్తం బ్రహ్మసూత్రాల సంఖ్య 545. విచారింపబడే ప్రమేయాన్ని బట్టి కొన్ని కొన్ని సూత్రాలు ఒక్కొక్క అధికరణంగా విభాగింపబడ్డాయి. ఈ విధంగా ఉండే అధికరణాల సంఖ్య 156. ఆ విధంగానే, ఈ అధికరణాలు మొత్తం నాలుగు అధ్యాయాలుగా విభాగింపబడ్డాయి. ఒక్కొక్క అధ్యాయంలో నాలుగు పాదాలు అనే క్రమంలో శారీరక మీమాంసలో మొత్తం 16 పాదాలు ఉన్నాయి. విధంగా శారీరక మీమాంస 545 సూత్రాలతో, 156 అధికరణాలతో, 16 పాదాలతో, నాలుగు అధ్యాయాలతో విరాజిల్లుతున్నది. అందువల్ల అష్టాక్షరి వేదాంత సంగ్రహరూపం కాగా శారీరక మీమాంస వేదాంత వివరణ అని చెప్పవచ్చు. ఈ రెండిటి మధ్య ఈ విధంగా గోచరించే వివరణ వివరణి భావం ప్రస్తుతం సంగ్రహంగా ప్రస్తావింపబడుతున్నది.

నారాయణోపనిషత్తు అష్టాక్షరీ మంత్ర స్వరూపాన్ని " ఓమిత్యగ్రే వ్యాహరేత్, నమ ఇతి పశ్చాత్, నారాయణాయేత్యుపరిష్టాత్, ఓమిత్యేకాక్షరమ్, నమ ఇతి ద్వే అక్షరే, నారాయణాయేతి పంచాక్షరాణి" (ఓం అని ప్రణవాన్ని మొదట పలకాలి. నమః అని తరువాత,

"నారాయణాయ" అని ఆ తరువాత పలకాలి. ఓం అనేది ఒకటే అక్షరం. నమః అనేది రెండు అక్షరాలు, నారాయణాయ అనేది ఐదు అక్షరాలు) అని వివరించి పలికింది. "ఓం, నమః, నారాయణాయ "అనే అష్టాక్షరిలోని ఈ మూడు పదాలు క్రమంగా పరమాత్మ సర్వశేషి, సర్వశరణ్యుడు, ప్రాప్యభూతుడు అనే అర్థాలను తెలుపుతున్నాయి.

అష్టాక్షరిలోని మొదటి పదం ప్రణవం. ఇది, అకార, ఉకార, మకారాలు అనే మూడు అక్షరాల సంపుటి. ఈ మూడు మూడు ప్రత్యేకమైన పదాలు. వీటిలో, మొదటి పదమైన అకారాన్ని " అవ –రక్షణే ॰ అనే ధాతువు నుండి పుట్టిన పదంగా గ్రహిస్తే, పరమాత్మ సర్వరక్షకుడు అనే అర్థాన్ని ఇది ఇస్తుంది. "అకారో విష్ణువాచకః " అని, " ఆ ఇతి భగవతో నారాయణస్య ప్రథమాభిధానమ్" అని కల ప్రమాణాలు అకార శబ్దవాచ్యుడు నారాయణుడే అనే విషయాన్ని ఘోషిస్తున్నాయి. అందుచేత అకారం ధాత్వర్థం ద్వారా నారాయణుడు సర్వ రక్షకుడు అని అర్థాన్ని ఇస్తున్నది.

ఆకారం "అకారో వై సర్వా వాక్" అనే విధంగా సమస్త శబ్దజాలానికి మూలం కనుక, అందులో వాచ్యవాచక సంబంధం ప్రకాశిస్తుంది. అందుచేత, అకారం సర్వ జగత్కారణ స్వరూపుడైన పరమాత్మను తెలుపుతుంది.

ఈ విధంగా అకారం ధాత్వర్థం ద్వారా పరమాత్మ యొక్క రక్షకత్వాన్ని, ప్రకృతి శక్తి ద్వారా ఆ స్వామి యొక్క కారణత్వాన్ని తెలియజేస్తున్నది.

ప్రణవానికి మంత్రశేషానికి మధ్య కల వివరణ వివరణి భావాన్ని బట్టి, ఆకారం నారాయణ పదానికి సంగ్రహం కనుక, నారాయణ పదంపై చతుర్థి విభక్తి వచ్చినట్లే, అకారం పై కూడా చతుర్థి విభక్తి వచ్చి లోపించింది. ఇది తాదర్థ్యంలో వచ్చింది. అందుచేత అకారం పై వచ్చి లోపించిన ఈ చతుర్థీ విభక్తి ద్వారా భగవంతుని సర్వశేషిత్వం చెప్పబడుతున్నది. దీనినిబట్టి ప్రణవంలోని అకారం పరమాత్మ యొక్క సర్వ రక్షకత్వ సర్వకారణత్వ సర్వశేషిత్వాలను తెలుపుతున్నదని తెలుస్తున్నది.

ప్రణవంలోని రెండవ అక్షరం ఉకారం. ఇది స్థాన ప్రమాణం ద్వారా అవధారణార్థాన్ని తెలుపుతున్నది. అంటే, పరమాత్మయే సర్వశేషి అనే విషయాన్ని నిష్కరించి పలుకుతున్నది. ఈ ఉకారం ద్వారా భగవానుడే సర్వకారణభూతుడు, సర్వ రక్షకుడు అనే అర్థం "సర్వం వాక్యం సావధారణమ్" అనే న్యాయంలో ప్రకాశిస్తున్నదని చెప్పవచ్చు.

ఇక, ప్రణవంలోని చివరి అక్షరం మకారం. దీనిని "మన "జ్ఞానే మను –అవబోధనే, మది – హర్షే " అని మొదలైన ధాతువుల నుండి పుట్టిన పదంగా చెప్పవచ్చు. కకారాది మకారాంతమైన వర్గాక్షరాలు 25 తత్వాలను నిర్దేశిస్తున్నవి–< అనే క్రమంలో 25వ అక్షరమైన మకారం 25 వ తత్వమైన జీవ తత్వాన్ని నిర్దేశిస్తున్నది కనుక, ప్రణవ మకారం ద్వారా జీవుని జ్ఞాతృత్వం తెలియబడుతున్నది.

ఈ విధంగా ప్రణవంలోని మూడు పదాలు అనదగిన అకార, ఉకార, మకారాలనే మూడు అక్షరాల ద్వారా తెలియబడే అర్థాలు ఏమంటే

– అకారంచేత తెలియపడే సర్వ రక్షకుడు సర్వకారణభూతుడు సర్వశేషి అయిన పరమాత్మ కోసమే మకారంచేత తెలియబడే జ్ఞాన స్వరూపుడైన జీవుడు ఉన్నాడు– అనే భావం వ్యక్తమవుతున్నది. సారంగా, పరమాత్మయే సర్వశేషి అనే అర్థాన్ని ప్రణవం తెలుపుతున్నది– అని గ్రహించాలి.

అష్టాక్షరిలోని రెండవ పదం నమశ్శబ్దం. ఈ పదం ఉపాయవాచకం అనే విషయం "భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ" అనే శ్రుతి ప్రమాణం వల్ల, " ద్రౌపద్యా సహితా స్సర్వే నమః చక్రుః జనార్ధనమ్" (ద్రౌపదితో కలసి ఆ పాండవులందరూ శ్రీకృష్ణుని నమస్కరించారు) అనే ఉపబృంహణ వాక్యం వల్ల, " వేంగడత్తుఱైవార్ క్కు నమ ఎన్నలామ్ కడమై" అనే దివ్యసూరి వచనం వల్ల స్పష్టమవుతున్నది. అందువల్ల నమశ్శబ్దం పరమాత్మ యొక్క ఉపాయత్వాన్ని తెలుపుతున్నది.

ఇక, " నారాయణాయ" అనే తృతీయ పదం చతుర్థీ విభక్తితో కూడినది అయినందున, భగవానుడైన నారాయణునకు కైంకర్యం సర్వ దేశ సర్వకాల సర్వావస్థలలోనూ సర్వవిధాలుగా చేయాలని ప్రార్థనను తెలియజేస్తున్నది. కైంకర్యం అంటే– శేషికి యథేష్టంగా ఉపయోగపడడమే కదా. దీనివల్ల భగవానుని ఉపేయత్వం తెలుపబడినట్లు అయినది. ప్రాప్యుడైన భగవానునకు నిత్య కైంకర్యం చేయడం అనేది నిత్యవిభూతి అనే పరమపదంలోనే సాధ్యం కనుక, ముక్తుడు కర్మ బంధాన్ని తీర్చుకొని పరమపదంలో భగవంతుని సాన్నిధ్యాన్ని చేరి, అక్కడ చేయదగిన నిత్య కైంకర్యం ఈ పదం ద్వారా తెలుపబడిందని ఏర్పడుతుంది.

ఈ విధంగా తిరుమంత్రంలోని మూడు పదాల ద్వారా వ్యక్తమయ్యే పరమాత్మ యొక్క సర్వశేషిత్వ, రక్షకత్వ, కారణత్వాలు, శరణ్యత్వం అనే ఉపాయత్వం, ఉపేయత్వం అనేవి శారీరక మీమాంసలో ఉండే నాలుగు అధ్యాయాలలో నిరూపింపబడిన క్రమం గమనించదగినది. అది ఇపుడు సంగ్రహంగా ప్రస్తావింపబడుతున్నది.

శారీరక మీమాంసలోని నాలుగు అధ్యాయాలకు వరుసగా సమన్వయాధ్యాయం (కారణాధ్యాయం), అవిరోధాధ్యాయం, సాధనాధ్యాయం, ఫలాధ్యాయం అనేవి పేర్లు. భగవంతుని కారణత్వం, అబాధ్యత్వం, ఉపాయత్వం, ఉపేయత్వం అనే ఈ నాలుగు ఈ నాలుగు అధ్యాయాలలోని ప్రధానమైన ప్రమేయాలు. మొదటి రెండు అధ్యాయాలు విషయద్వికమని కూడా చెప్పబడుతున్నవి. అంటే, బ్రహ్మ మనే విషయాన్ని గూర్చి ఇవి తెలుపుతున్నాయి. వీటికి సిద్ధద్వికమని కూడా పేరు. బ్రహ్మమనే సిద్ధవస్తువును గూర్చిన విచారం ఇందులో చేయబడుతున్నది కనుక, వీటికి ఈ వ్యవహారం ఏర్పడింది. చివరి రెండు అధ్యాయాలకు విషయుద్వికమని సాధ్యద్వికమని పేర్లు మూడవ అధ్యాయంలో బ్రహ్మ విద్యల రూపంలోని అనేక ఉపాసనలు తెలుపబడుతున్నందున, నాలుగవ అధ్యాయంలో బ్రహ్మానుభవం గూర్చి తెలుపబడుతున్నందున ఈ పేర్లు ఏర్పడ్డాయి. బ్రహ్మమనబడే భగవద్విషయానికి చెందిన ఉపాసనం విషయి కనుక, అది ప్రయత్నసాధ్యమే తప్ప, సిద్ధం కాదు. ఆ విధంగానే, బ్రహ్మానుభవం కూడా

భగవద్విషయానికి చెందినది కనుక, దానిని గూర్చినది విషయి–జ్ఞానమని అర్థం. బ్రహ్మవిద్య, బ్రహ్మానుభవాలనే రెండు జ్ఞానరూపాలే కదా.

ప్రథమాధ్యాయంలోని మొదటి పాదంలో బ్రహ్మానికి జగత్కారణత్వం లేదనే వాదం నిరాకరింపబడి, జగత్కారణమైన పరబ్రహ్మానే వస్తువు ఉన్నదని నిరూపింపబడింది. అందువల్ల పరబ్రహ్మాకు సంబంధించిన అసంభవ శంక మొదటి పాదంలోని మొదటి నాలుగు సూత్రాలలో తీర్చబడింది. అంటే, "చిదచిద్విలక్షణమైన బ్రహ్మమనే తత్వమే లేదు, అందువల్ల ఆ బ్రహ్మానికి లక్షణాన్ని నిర్వచించే ఆవశ్యకతయే లేదు "అనే పూర్వపక్షం మొదటి పాదంలో నిరాకరింపబడి, "బ్రహ్మమనే వస్తువు ఉన్నది, అది సర్వ జగత్కారణ" మనే విషయం నిరూపింపబడినందున, లక్ష్యాసంభవ ప్రయుక్తమైన లక్షణాసంభవశంక మొదటి పాదంలో తీర్చబడింది. శాస్త్రారంభరూపమైన మొదటి నాలుగు సూత్రాల రూపంలోని అధికరణాలలో ప్రమేయాన్ని " వ్యుత్పత్త్యభావః ప్రతిపత్తిదౌస్థ్య మన్యేన లభ్యత్వ మథాపరత్వమ్, ఏతాని, పై సూత్రచతుష్టయేనారంభములాని నిరాకృతాని" అనే శ్లోకం తెలుపుతున్నది. వేదాంతవాక్యాలు బ్రహ్మవిషయకమైన ప్రతీతిని కలిగించవు– అనే శంకను జజ్ఞాసాధికరణ, జన్మాద్యధికరణాలు, వేదాంతవాక్యాల వల్ల బ్రహ్మమనే తత్వమున్నది తెలిసినప్పటికీ వాటికి బ్రహ్మ ప్రతిపాదనలో దృష్టి లేదనే శంకను మిగిలిన రెండు అధికరణాలు తీరుస్తున్నాయి.

మొదటి అధికరణంలో లక్ష్యవిచార ప్రతిజ్ఞ, రెండవ అధికరణలో లక్ష్య లక్షణనిర్వచనం చేయబడగా, మూడవ అధికరణంలో లక్షణ విషయంలోని సందేహం, నాలుగవ అధికరణంలో లక్ష్యవిషయంలోని శంక తీర్చబడ్డాయి. మొదటి పాదంలోని మిగిలిన ఏడు అధికరణాలలో, సామాన్య శబ్దఘటితాలైన కారణ వాక్యాలు, విశేష శబ్దఘటితాలైన కారణవాక్యాలు ప్రకృతి పురుష విలక్షణుడైన పరమాత్మపరాలని నిరూపింపబడింది. ప్రథమాధ్యాయంలోని రెండవ, మూడవ, నాల్గవ పాదాలలో బ్రహ్మం వేదాంతవేద్యం అయినప్పటికీ, వేదాంతాలలో బ్రహ్మ భిన్నమైన వస్తువు కూడా జగత్కారణంగా చెప్పబడుతున్నదే! అనే వాదం నిరసింపబడి, జగత్కారణ వాక్యాలన్నీ చిదచిద్విలక్షణ బ్రహ్మ పరాలని నిరూపింపబడింది. అంటే, బ్రహ్మలక్షణంలో అవ్యాప్తి దోషం నివారింపబడింది. ఈ విధంగా ప్రథమపాదం అయోగవ్యవచ్ఛేద పరం, మిగిలిన మూడు పాదాలు అన్యయోగ వ్యవచ్ఛేదపరం అని చెప్పవచ్చు.

మొదటి అధ్యాయంలో నిరూపింపబడిన పరమాత్మజగత్కారణత్వం రెండవ అధ్యాయంలో స్థూణానిఖననన్యాయంలో ద్రఢీకరింపబడుతున్నది. స్మృతులతో, తర్కాలతో బ్రహ్మ జగత్కారణత్వాన్ని ప్రతివాదులు అడ్డుకోగా, వారి వాదాలను నిరసించి, బ్రహ్మం జగత్కారణమనే విషయాన్ని స్మృతి, తర్కపాదాలనే మొదటి రెండు పాదాలు స్థిరపరుస్తున్నాయి. బ్రహ్మకార్యం కాని వస్తువు కూడా ఉన్నది– అనే వాదం వియత్పాద, ప్రమాణ పాదాలనే చివరి రెండు పాదాలలో నిరసింపబడింది.

ఈ విధంగా శారీరకంలోని మొదటి రెండు అధ్యాయాలు పరమాత్మ జగత్కారణత్వాన్ని సమగ్రంగా, అప్రధృష్యంగా నిరూపిస్తున్నాయి కనుక, ఇవి ప్రణవంలోని అర్థాన్ని వివరిస్తున్నాయని చెప్పవచ్చు. ఈ అధ్యాయాలు రెండిటిలో పరమాత్మ చిదచిత్తులను శరీరంగా కలవాడని తెలుపబడినందున, పరమాత్మ సర్వశేషి అనే అంశం నిరూపింపబడినట్లే కదా. శరీరం, దానిని కలిగిన శరీరికి శేషమే కదా.

ఇక, శారీరకంలో పరమాత్మ రక్షకత్వం ఏ విధంగా తెలుపబడింది? అని అంటే, అకారంలోని ధాత్వర్థం ద్వారా తెలుపబడిన రక్షకత్వం కారణత్వరూపమైన పితృత్వం ద్వారా భాసిస్తున్నదని చెప్పవచ్చు. "ప్రజానాం వినయాధానాద్రక్షణాద్భరణాదపి, స పితా" (ప్రజలకు వినయాన్ని కలిగించడం వల్ల, రక్షించడం వల్ల పోషించడం వల్ల వారికి అతడు తండ్రి అయ్యాడు) అనే విధంగా పితృత్వ పూర్తికి రక్షకత్వం కూడా ఆవశ్యకమే కనుక, " భూతానా మవ్యయః పితా" (ప్రాణులకు ఏ నాడూ నశించని తండ్రి) అని, "ఎన్హుమ్ ఇఱవాద ఎంద్రై" (ఏనాటికి నశించని తండ్రి) అని, " మాతా పితా నారాయణః" (తల్లి, తండ్రి నారాయణుడే) అని కీర్తింపబడే సర్వజగత్పిత అయిన పరమాత్మ యొక్క కారణత్వం రక్షకత్వవ్యాప్యం. అంతేకాక, వివరణిలో ఉండే ప్రతి అంశం తప్పక వివరణంలో ఉండాడాలనే నియమం ఏమీ లేదు కదా.

శారీరకమీమాంసలోని మూడవ అధ్యాయంలో, బ్రహ్మోపాసనకు సంబంధించిన విచారణ చేయబడింది. ఈ ఉపాసనా విచారం ప్రధానంగా మూడవ పాదంలో చేయబడింది. బ్రహ్మోపాసనకు ఇతర విషయ వైరాగ్యం,

భగవంతుని విషయంలో కోరిక అనే రెండు చాలా ఆవశ్యకాలు. ఈ రెండిటి సిద్ధి కోసం మొదటి పాదంలో జీవుని దోషాలు చాలా వివరంగా నిరూపింపబడ్డాయి. ఇవి తెలిస్తే లౌకిక విషయ వైరాగ్యం కలుగుతుంది కదా. భగవంతుని విషయంలో తృష్ణ కలగడం కోసం భగవానుని కళ్యాణ గుణాల విచారం రెండవ పాదంలో చేయబడింది. ఈ పాదంలోని ఎనిమిది అధికరణాలలో, మొదటి నాలుగు అధికరణాలు జీవుని స్వప్న సుషుప్త్యాధి దశలలోని దోషాలు తెలుపబడినప్పటికీ, తరువాత కల 4 అధికరణాలలో పరమాత్మ కళ్యాణ గుణాలు నిరూపింపబడినందున, ఈ పాదంలో ప్రధానమైన దృష్టి భగవంతుని కల్యాణ గుణాలను తెలుపడంలోనే– అని పెద్దల అభిప్రాయం. మొదటి నాలుగు అధికరణాలలో స్వప్న పదార్ధ సృష్టిని చేయడంలో పరమాత్మకు కల కళ్యాణ గుణాలు తెలుపబడినందున, ఈ పాదం పరిపూర్ణంగా భగవత్కళ్యాణ గుణ ప్రతిపాదకమని అనడంలో ఏ అడ్డు లేదు. ఇక నాలుగవ పాదంలో బ్రహ్మవిద్యలకు అంగాలైన కర్మల విచారం చేయబడింది.

ఈ విధంగా శారీరక మీమాంసలోని మూడవ అధ్యాయంలో పూర్తిగా భగవద్భక్తికి సంబంధించిన విచారం చేయబడినందున, ఇందులోని ప్రమేయం, అష్టాక్షరీ మంత్రంలో ఉపాయనిష్కర్షను చేసే మద్యమ పదమైన నమశ్శబ్దం చేత ప్రతిపాదితమైన ప్రమేయం – అనే ఈ రెండు ఒకటే– అని ఏర్పడుతున్నది. సిద్ధోపాయరూపుడైన భగవంతుడే మోక్షానికి సాక్షాత్తుగా ఉపాయమైనా, అంటే, భగవంతుని నిర్హేతుక

కృపయే ఉపాయమైనప్పటికీ ఆ భగవత్కృప ప్రసరించటానికి తగిన యోగ్యతను ఉపాసనా రూపమైన భక్తి కలిగిస్తుంది కనుక, ఈ భక్తి పరంపరయా మోక్షోపాయం అవుతున్నదని గ్రహించడంలో అడ్డులేదు. " యమేవైష వృణుతే తేన లభ్యః" (భగవంతుడు ఎవరిని వరిస్తాడో అతని చేతనే ఆ భగవంతుడు పొందబడుతున్నాడు) అనే పరగత స్వీకార రూపమైన భగవత్కృపయే పరమాత్మ ప్రాప్తికి ఉపాయం– అని పలికిన శ్రుతియే, " దష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః" అని నిధిధ్యాసనరూపమైన భక్తిని కూడా మోక్షోపాయంగా పలికింది కదా. " భక్త్యా లభ్య స్త్వనన్యయా", " భక్తిక్రీతో జనార్ధనః" అని మొదలైన ఉపబృంహణవచనాలు, " పత్తుడై అడియవర్. క్కు ఎళియవన్ " (భక్తిని కలిగినవారికి సులభుడు) అని మొదలైన దివ్యసూరుల సూక్తులు ఇక్కడ స్మరణీయాలు. నిరంతరోపాసనా రూపమైన భక్తి వల్ల భగవంతుని అనన్యోపాయత్వనిశ్చయం కలుగుతుంది –అని అనడంలో లోటు లేదు కూడా. అందుచేత, శారీరకంలోని మూడవ అధ్యాయానికి, అష్టాక్షరిలోని రెండవ పదం అయిన నమశ్శబ్దానికి మధ్య ఐకకంఠ్యం సిద్ధం.

ఫలాధ్యాయం అనబడే నాలుగవ అధ్యాయంలోని మొదటి రెండు పాదాలకు ఆవృత్తిపాదమని, ఉత్క్రాంతి పాదమని పేర్లు. మూడవ అధ్యాయంలో నిరూపింపబడిన బ్రహ్మ విద్యలకు పూర్వాఘ ఉత్తరాఘాల ఆశ్లేష వినాశాలు, ఉత్తరాఘానికి ఆ దేహం నుండి జీవుని బ్రహ్మ రంధ్రం ద్వారా నిర్గమనం అనేవి ఫలాలుగా ఈ రెండు పాదాలలో నిరూపించబడ్డాయి. ఈ రెండు అనిష్ట నివృత్తి రూపాలు. ప్రథమపాదంలోని

మొదటి ఆరు అధికరణాలలో బ్రహ్మ విద్యా స్వరూప శోధనం చేయబడగా, తరువాత ఉండే ఐదు అధికరణాలలో విద్యాఫలం తెలుపబడింది. ముక్తిరూప ఫలాన్ని నిరూపించే ఈ నాలుగవ అధ్యాయంలో ఉపాయరూపాలైన బ్రహ్మ విద్యల స్వరూప విచారం చేయబడడం అనేది – భగవద్భక్తి "సుసుఖం కర్తు మవ్యయమ్" అనే విధంగా ఫలమైనందున తగినది. " పుల్ గు పற்றற்றே" (ఇతర విషయ సంగాన్ని విడచిపెట్టి, భగవంతుని ప్రీతితో సంశ్లేషించు) అని ఆళ్వారులు కూడా భక్తిని అంగనాపరిష్వగం వలె సుఖరూపం అన్నారు.

రెండవ పాదమైన ఉత్క్రాంతి పాదంలో ఉపాసన వల్ల కలిగే స్థూలదేహనివృత్తి తెలుపబడింది. బ్రహ్మవిద్యానిష్ఠునకు కలిగే పూర్వాఘ ఉత్తరాఘాల అశ్లేష వినాశరూపమైన ఫలం మొదటి పాదంలో తెలుపబడగా, బ్రహ్మ వేత్తకు కూడా మరణం అనేది ఉన్నది– అని రెండవ అధ్యాయంలో నిరూపింపబడింది. జీవుని జాగ్రదవస్థావిచారం మూడవ అధ్యాయంలో నిరూపింపబడినప్పుడు, అక్కడే మరణం గూర్చి కూడా తెలుపబడాలి కదా! అని అంటే, ఉపాసకునకు మరణం అనేది సుఖరూపం కనుక "అత్ర బ్రహ్మ సమశ్నుతే" (ఇక్కడే బ్రహ్మను పొందుతున్నాడు) అనే శ్రుతివాక్యాన్ని పురస్కరించుకొని వచ్చిన, ఉపాసకునకు మరణం లేదనే వాదాన్ని నిరసించడం ఆ ప్రకరణంలో ఆవశ్యకం కనుక, రెండవ పాదంలో మరణ చింతన చేయబడింది.

గతిపాదం, ముక్తి పాదం అనే మూడవ, నాలుగవ పాదాలలో దేహం నుండి వెలువడిన ఉపాసకునకు అర్చిరాధి మార్గం ద్వారా కలిగే

బ్రహ్మలోక ప్రాప్తి, పునరావృత్తి లేని పరిపూర్ణ బ్రహ్మానుభవాలు నిరూపింపబడ్డాయి. ఇవి ఇష్ట ప్రాప్తిరూపాలు. గతిపాదంలో బ్రహ్మలోకానికి తీసుకొని పోయే దివ్య పురుషుల వివరం, తీసికొని వెళ్ళే క్రమం, స్థానం మొదలైనవి విచారింపబడ్డాయి. ఇక, ముక్తిపాదంలో అర్చిరాది మార్గం ద్వారా బ్రహ్మ లోకాన్ని చేరిన విద్యానిష్ఠునకు పరిపూర్ణమైన బ్రహ్మానుభవం కలిగే క్రమం వివరించబడింది. ఇది అంతా నారాయణ శబ్ద వివరణమే కదా. పరమపదంలో పరమాత్మకు సర్వదేశ సర్వకాల సర్వావస్థలలో సర్వవిధ కైంకర్యమే ఆ బ్రహ్మానుభవం. అక్కడ ముక్తుడు పరమాత్మ యొక్క అనంతలైన స్వరూప రూప లీలల అనుభవాన్ని పొందుతాడు. నారాయణ నామం నిరవధిక స్వరూపరూప గుణవిభవలీలావిశిష్టుడైన పరమాత్మను తెలుపుతున్నది కనుక, ముక్తుని బ్రహ్మానుభవం నారాయణ శబ్దార్థానుభవమే. అయితే, అష్టాక్షరిలో జీవుడు నారాయణకు మాత్రమే భోగ్యుడు– అని తెలుపబడగా, శారీరకంలో జీవుని పరబ్రహ్మానుభవం తెలుపబడింది. అంటే, జీవుడు పరమాత్మానుభవాన్ని పొందుతాడని తెలుపబడిందే. ఇది వ్యుత్క్రమంగా గోచరిస్తున్నది కదా! అనే సందేహం కలుగవచ్చు.

"సోశ్నుతే సర్వాన్ కామన్ సహ బ్రహ్మణావిపశ్చితా" అనే శృతి వాక్యంలోని కామశబ్దానికి "కామ్యంత ఇతి కామాః"అనే వ్యుత్పక్తి ద్వారా చెప్పబడే భగవంతుని కల్యాణ గుణాలు మిగిలిన అన్నిటినీ లక్షిస్తాయి. లీలా విభూతి భగవంతుని విభూతులలో అంతర్భవిస్తుంది కనుక,

ముక్తునకు లీలావిభూతి కూడా అనుభావ్యమే. " ఇమాన్ లోకాన్ కామాన్ కామరూపీ అనుసంచరన్"అని శ్రుతివాక్యం.

ఈ విధంగా సర్వప్రకార విశిష్టుడైన పరమాత్మ అయిన శ్రీమన్నారాయణడే ప్రాప్యుడనే, తిరుమంత్రంలోని పదమైన "నారాయణాయ" అనే పదం ద్వారా తెలుపబడిన అర్థమే శారీరకంలోని నాలుగవ అధ్యాయంలో నిరూపింపబడినందున, ఈ రెండిటి ప్రమేయాలలోని ఐక్యం సిద్ధం.

ముక్తుని సంపూర్ణ బ్రహ్మానువభవాన్ని తెలిపే ఫలాధ్యాయంలోని "అనావృత్తిః శబ్దాత్" అనే చివరి సూత్రంలో జీవుని అపునరావృత్తి తెలుపబడింది. దీనికి కారణం, అతడు పరమాత్మకు అత్యర్థ ప్రియుడు కావడమే. కనుక, ఈ సూత్రంలో జీవుని అనన్య భోగ్యత్వం కూడా తెలుపబడినదని అనడంలో సందేహం లేదు కనుక, అష్టాక్షరిలో తెలుపబడిన జీవుని అనన్యభోగ్యత్వం కూడా ఫలాధ్యాయంలో చెప్పబడినది– అనేది సుస్పష్టం.

ఏతావతా ఏమి స్పష్టమైనది? అని అంటే, అష్టాక్షరిలోని మూడు పదాల ద్వారా తెలియజేయబడే ఈ జీవుని అనన్యార్హశేషత్వ, అనన్య శరణత్వ, అనన్య భోగ్యత్వాలు అనే ఈ మూడు విషయాలు శారీరక మీమాంసలో నాలుగు అధ్యాయాలలో ప్రతిపాదింపబడినందున, ఈ రెండిటికి అర్థంలో ఐకకంఠ్యం స్పష్టమని ఏర్పడుతున్నది.

ఇంకొక విధంగా కూడా అష్టాక్షరి –శారీరక మీమాంసల మధ్య ప్రతిపాద్యసామ్యాన్ని దర్శించవచ్చు.

అష్టాక్షరిలోని ప్రణవం, నమః శబ్దం, నారాయణాయ అనే పదం– అనే ఈ మూడు పదాలలో, మొదటి పదమైన ప్రణవానికి, మిగిలిన రెండిటికి మధ్య వివరణ వివరణి భావం ఉన్నదని శ్రీపిళ్లైలోకాచార్యులవారు ముముక్షుప్పడి అనే రహస్య గ్రంథంలో " ఇని మేల్, ప్రణవత్తై వివరిక్కిఱదు నమస్సు –––" ఇత్యాదిసూత్రాలలో "మంత్ర శేషం, అనబడే నమశ్శబ్దం, నారాయణాయ అనబడే పదాలు ప్రణవాన్ని వివరిస్తున్నాయి, ఆ క్రమంలో, ఉకారాన్ని నమశ్శబ్దం వివరిస్తున్నది, అకారాన్ని నారాయణ పదం వివరిస్తున్నది, మకారాన్ని నారాయణ పదంపై ఉండే చతుర్థీ విభక్తి వివరిస్తున్నది, మకారాన్ని నారాయణ పదంలోని నారపదం వివరిస్తున్నది అని కూడా కొందరు అంటారు" అని తెలియజేశారు.

వివరణం అంటే– పూర్వం చెప్పబడిన విషయానికి ఉపయోగించే అర్థాంతరాన్ని తెలియజేస్తూ, ప్రస్తుతార్థాన్ని వివరించడం– అని శ్రీవరవరమునులు ఈ సందర్భంలో తమ వ్యాఖ్యలో తెలియజేశారు. ప్రణవంలోని ఉకారం అవధారణార్థకం. ప్రణవంలోని లుప్తచతుర్థితో కూడిన ఆకారం జీవుడు భగవంతునకు శేషమని తెలుపుతున్నది. జీవుడు భగవంతునికే తప్ప ఇంకొకరికి శేషం కాదు– అనే విషయాన్ని అవధారణార్థాన్ని తెలియజేసే ఉకారం తెలుపుతున్నది. ఈ విధంగా ఉకారం ద్వారా తెలుపబడిన జీవుని భగవదనన్యార్హ శేషత్వాన్ని నమశ్శబ్దం మరింత విశదీకరిస్తున్నది. అన్యశేషత్వాన్ని నిషేధించేటప్పుడు, భగవంతుని కంటే ఇతరులకు అతడు శేషం

కాకపోయినా, తనకు తాను శేషం కావచ్చు కదా! అనే భావం తోచవచ్చు. ఆ భావాన్ని "నేను నాకు శేషం కాదు" అని అర్థం ఇచ్చే నమశ్శబ్దం నిషేధిస్తున్నది. ఈ విధంగా ఉకారార్థాన్ని నమశ్శబ్దం వివరిస్తున్నది.

ప్రణవంలోని అకారం భగవంతుని రక్షకత్వాన్ని తెలుపుతున్నది. రక్షకత్వం అనేది రక్ష్య సాపేక్షం కనుక, రక్షింపబడే చేతనాచేతనాలు ఇక్కడ లక్షింపబడతాయి. రక్షణకు కావలసిన జ్ఞానం, శక్తి, కరుణ మొదలైన గుణాలు కూడా లక్షింపబడతాయి. వీటిని అన్నిటిని నారాయణ పదం శబ్దతః తెలుపడం ద్వారా వివరిస్తున్నది.

ప్రణవంలోని అకారం " ఆ ఇతి భగవతో నారాయణస్య ప్రథమాభిధానమ్" (అ అనేది భగవానుడైన నారాయణుని మొట్టమొదటి పేరు) అనే విధంగా పరమాత్మను తెలుపుతున్నది. ఈ అకారం " అకారో వై సర్వా వాక్ "అనే విధంగా సమస్తశబ్దాలకు మూలం. పరమాత్మ సమస్త వాచ్యసముదాయానికి మూలమైనందున, వాచ్యవాచక సంబంధం అకారానికి, పరమాత్మకు మధ్య భాసిస్తున్నది. ఈ విధంగా అకారం పరమాత్మకు కల సర్వకారణత్వాన్ని తెలుపుతున్నది. ఆకారం పై వచ్చి లోపించిన లుప్త చతుర్థీ విభక్తి పరమాత్మ యొక్క సర్వశేషిత్వాన్ని తెలియజేస్తున్నది. అకారం ద్వారా తెలుపబడే భగవానుని సర్వకారణత్వ, సర్వశేషిత్వాలు రెండు నారాయణపదం చేత వివరింపబడుతున్నాయి. " నరుడు అనబడేవాడు పరమాత్మ. ఆ పరమాత్మ నుండి అన్ని వస్తువులు పుడుతున్నాయి. అందుచేత వాటికి నారాలు అని పేరు. వాటిని నివాస స్థానంగా కలవాడు కనుక, పరమాత్మ నారాయణ పదంచేత

చెప్పబడుతున్నాడు" అనే పౌరాణికమైన నారాయణ శబ్ద నిర్వచనం నారాయణ నకు గల సర్వకారణత్వాన్ని తెలుపుతున్నది. సమస్త తత్వాలకు, పరమాత్మకు మధ్య ఉండే ఈ శరీర శరీర భావం ఆ స్వామికి కల సర్వశేషత్వాన్ని సూచిస్తుంది కదా. " సర్వాత్మనా ఆధేయతయా, నియమ్యతయా, శేషతయా చ అపృథక్సిద్ధం ప్రకారభూతమితి ఆకారః శరీరమితి చోచ్యతే" (అన్ని విధాలుగా ఆధారపడి ఉండేదిగా, నియమింపబడేదిగా, శేషంగా, విడదీసి చూడడాడానికి వీలు కానిదిగా ఉన్న ప్రకారంగా ఉండే ఆకారం శరీరం అని చెప్పబడుతున్నది) అని వేదార్థ సంగ్రహంలో భగవద్రామానుజులు శరీరంగా ఉండడం శేషత్వాన్ని సూచిస్తుందని అన్నారు. ఈ విధంగా ప్రణవంలోని అకారాన్ని నారాయణ పదం వివరిస్తున్నది.

ప్రణవంలోని మకారాన్ని మంత్రశేషంలోని చతుర్ధీ విభక్తి వివరిస్తున్నది. ప్రణవంలోని మకారం " మన– జ్ఞానే, మను –అవబోధనే, మది – హర్షే" మొదలైన ధాతువుల నుండి పుట్టిన పదమైనప్పుడు, జ్ఞానానందాలను లక్షణంగా కల జీవుని నిర్దేశిస్తుంది. "మసి–పరిమాణే "అనే ధాతువు నుండి పుట్టినదిగా భావిస్తే, జీవుడు అణుపరిమాణుడని తెలుపుతున్నది. అంతేకాక కకారం మొదలుకొని మకారం వరకు ఉండే వర్ణాలలో, మకారం 25 వ వర్ణం అయినందున, ఇది 25వ తత్వమైన జీవుని తెలుపుతుంది. ఈ విధంగా మకారం జ్ఞానానందాలను లక్షణంగా కలిగిన, అణుపరిమాణుడైన జీవుని నిర్దేశిస్తున్నదని తెలుస్తున్నది.

జీవుని జ్ఞాతృత్వం భోక్తృత్వాన్ని లక్షిస్తుంది. చైతన్య ప్రయుక్తమైన ఈ భోక్తృత్వం జీవుని అంతరంగ లక్షణం కాదు. శేషత్వమే జీవుని అంతరంగ నిరూపకం. అందువల్ల జీవుని భోక్తృత్వం కంటే భగవానునకు మాత్రమే ఇష్ట వినియోగార్హమై ఉండడమనే అనన్య భోగ్యత్వమే ప్రధాన లక్షణమనే విషయాన్ని నారాయణ పదంపై ఉండే వ్యక్త చతుర్థి తెలుపుతున్నది. ఈ విధంగా ఈ చతుర్థి, మకారంచేత స్పష్టం చేయబడని జీవుని అనన్య భోగ్యత్వాన్ని తెలుపుతున్నది కనుక, మకారానికి వివరణ రూపమైనది.

మకారంచేత జీవుని జ్ఞాతృత్వం చెప్పబడినప్పటికీ, జీవతత్వానికి గల నిత్యత్వం, అనేకత్వం, ఏకరూపత్వం మొదలైన ధర్మాలు మకారం ద్వారా స్పష్టం కావడం లేదు. వీటిని నార శబ్దం తెలుపుతున్నది. నారాలంటే నిత్య వస్తువుల సమూహాలే కదా.

ఈ విధంగా గమనించి చూసినప్పుడు, ప్రణవార్థాన్ని మంత్రశేషం వివరిస్తున్నది కనుక, ఈ రెండిటికీ మధ్య గల వివరణ వివరణి భావం స్పష్టమవుతున్నది. ఇటువంటి వివరణ వివరణి భావాన్ని శారీరకంలో కూడా గమనించవచ్చు.

శారీరకంలో వేదవ్యాసులు ఉపోద్ఘాత రూపమైన చతుస్సూత్రి తరువాత, ఈక్షత్యధికరణంలో శాస్త్రారంభాన్ని చేశారు. ఈ అధికరణంలోని. " ఈక్షతేః నాశబ్దమ్" (జగత్కారణం ప్రకృతి కాదు, "తదైక్షత" అని సృష్టి మూలంగా చెప్పబడిన ఈక్షణ రూపమైన క్రియ అచేతనమైన ప్రకృతికి సంభవించదు కనుక) అనే సూత్రం ద్వారా పరమాత్మ జగత్కారణుడు,

అచిత్తు కంటే విలక్షణుడు− అనే విషయాన్ని తెలియజేశారు. " తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్" (ఆ పరమాత్మను ఆరాధించేవారికి మోక్షం కలుగుతుందని ఉపదేశింపబడడం వల్ల) అనే సూత్రం ద్వారా అతడే మోక్షోపాయమని నిశ్చయించారు. జగత్కారణాన్నే కదా వేదాంతం "కారణం తు ధ్యేయః" అని మోక్షోపాయంగా పలికింది. తరువాత, ఆనందమయాధికరణంలో అతడే ప్రాప్యభూతుడని, అతడు బద్ధముక్త ఉభయ విలక్షణుడని తెలియజేశారు. " "ఆనందమయో ఽ భ్యాసాత్" (ఆనందమయుడు పరమాత్మయే, ఎందుకంటే, శ్రుతులలో అతని ఆనందం నూరు నూరు రెట్లు పెంచి పలికినందున), " కామాచ్చ నానుమానాపేక్షా" (పరమాత్మ తన సంకల్పంతో సృష్టి చేసినట్లు శ్రుతిలో చెప్పబడినందున, జగత్సృష్టిలో అచిత్ సంబంధం అపేక్షితం కాదు), " నేతరోనుపపత్తేః" (బ్రహ్మం కంటే వేరైన ముక్త పురుషుడకూడా ఆనందమయుడు కాడు, ముక్తునకు నిరుపాధికమైన విపశ్చిత్త్వం ఉండదు, ఎందుకంటే, అది అనుపన్నం కనుక), " భేదవ్యపదేశాచ్చ" (జీవుడు ఆనందమయుని కంటే భిన్నుడుగా చెప్పబడినందున, జీవుడు ఆనందమయుని కంటే భిన్నుడు) అనే సూత్రాల ద్వారా తెలిపారు. తరువాత అంతరధికరణంలో పరమాత్మ దివ్యమంగళ విగ్రహం కలవాడని అన్నారు. " పరమాత్మ జగత్కారణభూతుడు, మోక్షోపాయభూతుడు, ప్రకృతి పురుషుల కంటే విలక్షణుడు, దివ్య మంగళ విగ్రహాన్ని కలవాడు" అనే వ్యాస సిద్ధాంత వివరణమే మిగిలిన శారీరక శాస్త్రం అంతా.

పూర్వం నిరూపించినట్లుగా, ఈక్షత్యధికరణంలో నిరూపించిన పరమాత్మ సర్వజగత్కారణ రూపుడు, చిదచిద్విలక్షణుడు–అనే విషయాన్ని శారీరకంలోని సమన్వయ, అవిరోధాధ్యాయాలు అనే మొదటి రెండు అధ్యాయాలు, " తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్" అనే సూత్రంద్వారా తెలుపబడిన పరమాత్మ మోక్షోపాయభూతుడు అనే విషయాన్ని మూడవ అధ్యాయం, ఆనందమయాధికరణ ద్వారా తెలుపబడిన ఆనందమయుడైన పరమాత్మ ప్రాప్యభూతుడు అనే విషయాన్ని ఫలాధ్యాయం అనబడే నాల్గవ అధ్యాయం వివరిస్తున్నవి. ఈ విధంగా ఈక్షత్యధికరణంనుండి ఉండే మూడు అధికరణాల వివరణమే మిగిలిన భాగం కనుక, ఈ రెండిటి మధ్య గల వివరణ వివరణిభావం స్పష్టమవుతున్నది.

ప్రసంగవశంచేత ఇంకొక విషయం కూడా ఇక్కడ ప్రస్తావించబడుతున్నది. ప్రణవంలోని అకారం ప్రకృతి శక్తి ద్వారా అకార శబ్దవాచ్యుడైన భగవంతుని కారణత్వాన్ని, ధాత్వర్థం ద్వారా రక్షకత్వాన్ని తెలుపుతున్నవి. ఈ కారణత్వ, రక్షకత్వాలు ప్రణవంలోని మధ్యమాక్షరమైన, అవధారణార్థకమైన ఉకారం ద్వారా విశేషింపబడడం వల్ల, భగవంతుడే జగత్కారణభూతుడు అని, అతడే రక్షకుడు అనే విషయం స్పష్టపడుతున్నది. వీటిలో, మొదటి అంశాన్ని, అంటే, కారణత్వాన్ని, శారీరకంలోని మొదటి రెండు అధ్యాయాలు నిరూపించగా, రెండవ అంశమైన రక్షకత్వాన్ని మూడవ అధ్యాయం నిరూపిస్తున్నది. ప్రణవంలోని మూడవ అక్షరం అయిన మకారం ద్వారా జీవుని జ్ఞాతృత్వ

భోక్తృత్వాలు తెలుపబడుతున్నవి. లుప్త చతుర్థీ విభక్తితో కూడుకున్న అకారం ద్వారా భగవానుని సర్వశేషిత్వం చెప్పబడుతున్నందున, ఈ సర్వశేషిత్వ దృష్టిలో మకార శబ్దవాచ్యుడైన జీవుని జ్ఞాతృత్వ భోక్తృత్వాలను గమనించినప్పుడు, అవి భగవదానందాధీనమైనవని తెలుస్తున్నది. కనుక, జీవుని అనన్యభోగ్యత్వం స్పష్టపడుతున్నది. అంటే, జీవుని చైతన్య ప్రయుక్తమైన ఆనందం అతని స్వరూపంలోకి చేరినదే అయినా, అతని స్వరూపానికి శేషత్వ పారతంత్ర్యాలు అంతరంగ నిరూపకాలు కనుక, వాటికి తగినట్లు అతడు భగవదానందానికి ఉపయోగపడినప్పుడు ఆ భగవంతుని కలిగే ప్రీతిని చూసి అతడు పొందే ఆనందమే స్వరూపానికి అనుగుణమనే విషయం స్పష్టమవుతున్నది. ఈ విధమైన జీవుని అనన్య భోగ్యత్వం చతుర్థాధ్యాయంలో వివరింపబడింది. ఈ అధ్యాయంలో జీవుడు పరమపదాన్ని చేరి అక్కడ పొందే బ్రహ్మానుభవాన్ని గూర్చి వివరింపబడినట్లే, అనన్య భోగ్యత్వం కూడా "అనావృత్తిః శబ్దాత్" ఇత్యాది సూత్రాలలో తెలుపబడిన పైనాన్ని భగవద్రామానుజులు తమ అందమైన సూక్తుల ద్వారా స్పష్టం చేశారు. శీభాష్యంలో చివరిలో " న చ పరమ పురుషః సత్యసంకల్పః అత్యర్థ ప్రియం జ్ఞానినం లబ్ధ్వా న కదాచిదావర్తయిష్యతి " (సత్య సంకల్పుడైన పరమ పురుషుడు తనకు చాలా ఇష్టమైన జ్ఞాని అయిన ఆత్మను పొంది, మళ్ళీ తిరిగి అతనిని ఈ లోకానికి రానివ్వడు) అనే సూక్తి ఇక్కడ స్మరణీయం. ఈ విధంగా శారీరకమీమాంస ప్రణవార్థ వివరణం అనే అంశం కూడా గమనించదగినది.

" ప్రపద్యే ప్రణవాకారం భాష్యం రంగ మివాపరమ్, పరస్య బ్రహ్మణో యత్ర శేషిత్వం స్ఫుట మీక్ష్యతే" (వేరొక శ్రీరంగ విమానంవలె, ప్రణవాకారంగా ఉండే శీభాష్యాన్ని శరణు పొందుతున్నాను. శ్రీరంగ విమానంలో శేషశాయిత్వరూపమైన శేషిత్వం, శ్రీ భాష్యంలో, ప్రణవంలో చేతనా చేతనాలను అన్నిటిని తనకు యథేష్ఠ వినియోగార్హంగా కలిగి ఉండడం అనే శేషిత్వం స్ఫుట పడుతున్నాయి) అనే ప్రసిద్ధమైన స్తుతి శ్లోకం ప్రణవ శ్రీభాష్యాలకు మధ్య గల అర్థసామ్యాన్ని తెలుపుతున్నది. ఈ విధమైన సామ్యాన్నే కాక, శబ్దసామ్యాన్ని కూడా ఈ రెండిటి మధ్య పూర్వాచార్యులు సూచించారు. " అఖిలభువన జన్మ "ఇత్యాదిగా శ్రీ భాష్యం మొదట ప్రణవంలోని మొదటి అక్షరమైన అకారం, తృతీయాధ్యాయం తృతీయపాద శ్రీ భాష్యం ఆరంభంలో "ఉక్తమ్" అని చెప్పబడినందున, అక్కడ ప్రణవంలోని రెండవ అక్షరమైన ఉకారం, శ్రీ భాష్యం " ఇతి సర్వ సమంజసమ్" అని పూర్తి అవుతున్నందున, చివరిలో ప్రణవంలోని చివరి అక్షరమైన మకారం నిక్షేపింపబడినది కనుక, ఈ విధమైన ప్రణవాక్షర విన్యాసం ఈ రెండిటికీ మధ్య గల సామ్యానికి ఒక సంకేతం– అని పూర్వాచార్య సూక్తి. ప్రణవానికి, శారీరక మీమాంసకు మధ్య సామ్యం ఉన్నప్పుడు, ఆ శారీరక మీమాంస వివరణరూపమైన శీభాష్యానికి ప్రణవంతో సామ్యం ఉండడంలో ఆశ్చర్యం ఏమీ లేదు కదా.

# భగవద్రామానుజుల మధురార్థనిర్వాహమ్

మన పూర్వాచార్యులు అందరిలో భగవద్రామానుజులకు విలక్షణమైన స్థానం ఉన్నది. వీరు ఆచార్యహారంలో నాయకమణిగా భాసిస్తున్నారు. ఈ ఆచార్యవర్యులు ఉభయ వేదాంతాలలో చేసిన అర్థనిర్వాహాలు చాలా మనోహరంగా ఉంటాయి. అవి అన్నీ ప్రకరణానుగుణంగాకూడా ఉంటాయి ప్రత్యేకించి వారు దివ్యప్రబంధాలలో దివ్యసూరుల సూక్తులకు అర్థాన్ని చెప్పేటప్పుడు చేసిన అర్థనిర్వాహాలు చాలా మధురంగా ఉంటాయి. ఈనాడు మనకు పలువురు పూర్వాచార్యుల దివ్యప్రబంధాల వ్యాఖ్యానాలు లభిస్తున్నాయంటే అవి భగవద్రామానుజుల అనుగ్రహఫలమే అనేది అందరికీ తెలిసిన విషయమే. ఈ విషయం తిరువాయ్ మొ*ழి* ప్రబంధానికి పరాశర భట్టర్ అనుగ్రహించిన "వాన్ తిక*ழு*మ్ శోలై" అనే తనియన్ పాశురం వల్ల, పెరియ తిరుమొ*ழி* ప్రబంధానికి ఎంబార్ అనుగ్రహించిన "ఎంగళ్ కతియే!" అనే తనియన్ పాశురం వల్ల స్పష్టమవుతున్నది. తిరువాయ్ మొ*ழி* ప్రబంధాన్ని కన్న తల్లి నమ్మాళ్వారులు కాగా, దానిని పెంచి పెద్ద చేసిన పెంపుడు తల్లి భగవద్రామానుజులు అని భట్టర్ అన్నారు.

శ్రీరామానుజులు అనుగ్రహించిన పలు అందమైన అర్థనిర్వాహాలను నమ్పిళ్ళై ఈడు వ్యాఖ్యానంలో చాలా చోట్ల ప్రస్తావించారు. అటువంటి నిర్వహాలలో ఒక అర్థనిర్వహాన్ని ఇప్పుడు గమనిద్దాం.

"తద్భక్తైర్వా సమాగమః" ఎన్గ విడత్తిల్ "వా" ఎన్గత్తై అవధారణత్తిలే యాక్కి,

"ఉద్దేశ్యన్దానే ఇజ్గే సిద్ధక్కుమ్ కాణ్" ఎన్టు ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్ ద వార్తై".

("తద్భక్తై ర్వా సమాగమః" – అనేచోట "వా" అనే దానిని అవధారణార్థకంగా గ్రహించి, ఉద్దేశ్యం ఇక్కడ సిద్ధిస్తుంది సుమా! అని శ్రీరామానుజులు అర్థం చెప్పారు.)

తిరువాయ్ మొழிలోని "పయిలుమ్ శుడరొళి" (3-7) అనే దశకానికి ప్రవేశాన్ని అనుగ్రహించే నమ్బిళ్ళై భాగవతశేషత్వవిషయంలో శ్రీ రామానుజులు పల్కిన ఒక వార్తను ఈ రీతిలో ప్రస్తావించారు.

"సంసారవిషవృక్షస్య ద్వే ఫలే హ్యమృతోపమే,

కదాచిత్ కేశవే భక్తిః తద్భక్తై ర్వా సమాగమః"

(సంసారమనే విషవృక్షానికి అమృతంవంటి రెండు ఫలాలున్నాయి. అవి ఏవి? అంటే, ఒక సమయంలో, కేశవుని విషయంలో భక్తి ఒకటి. ఆ కేశవుని భక్తుల తోనే సమాగమం ఇంకొకటి) అనేది ఒక సంస్కృతచాటువు. ఈ శ్లోకాన్ని శ్రీరామానుజులు భాగవతశేషత్వమే పరమపురుషార్థమనే విషయానికి ప్రమాణంగా ఉదాహరిస్తూ

వివరించారు. మేల్నాడులో (తిరునారాయణపురంలో) కేశవదీక్షితులనేవారి ఇంటిలో వేంచేసి ఉండగా శ్రీరామానుజులు ఈ శ్లోకాన్ని వివరిస్తూ, ఇందులో అపూర్వమైన ఒక అర్థాన్ని పల్కినట్లు నమ్పిళ్ళై తెలిపారు.

ఈ క్రూరమైన సంసారంలో భగవద్భక్తి అనేది ఏదో ఒక సమయంలో కల్గుతుంది. దానికి మించి, ఒకానొకప్పుడు దుర్ఘటమైన సమాగమమే కల్గుతుంది - అనేది ఆ అపూర్వార్థం.

"కదాచిత్ కేశవే భక్తిః తద్భక్తైర్వా సమాగమః" - అనేది చాటువు. దీనిలో "వా" అనే అవ్యయాన్ని సాధారణంగా "లేక" - అనే వికల్పార్థకంగా గ్రహిస్తారు. ఆ విధంగా గ్రహిస్తే, కేశవుని పట్ల భక్తిగాని, లేక, అతని భక్తులతో సమాగమం గాని - అనే అర్థం వస్తుంది. ఈ అర్థంలో రెండు కొఱతలున్నాయి. "ఇది గాని, లేక, అది గాని" అని అంటే, ఏదో ఒకటి మాత్రమే ఏర్పడుతుంది - అనే అర్థం వస్తుంది. అయితే, శ్లోకంలో "ద్వే ఫలే " అని రెండు ఫలాలు కల్గుతాయని చెప్పబడింది. కనుక, ఆ అర్థం చెప్పడం పొసగదు. అంతేకాక, భగవద్భక్తి కంటే భాగవత భక్తి అభ్యర్హితమనే (గొప్పదనే) అర్థం కూడా స్ఫురించదు. అందుచేత, "వా" అనే పదానికి "ఏవ" అనే అర్థంకూడా ఉన్నది కనుక, దానిని గ్రహించి, "ఒకానొక సమయంలో భగవద్భక్తి కల్గుతుంది, ఆ పిమ్మట అంతకు మించి, అంతకంటే గొప్పదైన భాగవత భక్తియే సిద్ధిస్తుంది. ఈ ఉద్దేశ్యమే -

భాగవతసమాగమమే - సిద్ధిస్తుంది" - అని శ్రీరామానుజులు సరసంగా అర్థాన్ని పలికారు. ఇక్కడ ఆ "ఉద్దేశ్యమే" - అంటే - అరుదైనది, లభించడానికి అరుదైన ఏదో, అదే సిద్ధిస్తుంది - అనేది తాత్పర్యం. అరుంబదవివరణంలో కూడా "ఏవకారద్యోత్యద్యోతకమాయ్ క్కొణ్డు, ప్రసిద్ధాభ్యర్థిత దుర్లభజ్ఞాపకమెన్టపడి" (వా" అనే అన్వయం ఏవకారంద్వారా స్ఫురించే అర్థాన్ని స్ఫురింపజేసేదై, ప్రసిద్ధమైన, ప్రధానమైన, దుర్లభమైన భాగవత శేషత్వాన్ని తెల్పుతుంది) అని వివరింపబడింది. అందువల్ల "కేశవే భక్తిః కదాచిత్ తద్భక్తై స్సమాగమ ఏవ భవతి" – ఒకానొకప్పుడు, కేశవభక్తి ఆ స్వామి భక్తుల సమాగమంగా సిద్ధిస్తుంది - అని ఇక్కడ తాత్పర్యం.

ప్రభువును చూడగోరి వెళ్ళినవారికి ఒకప్పుడు ప్రభువులకు ఇష్టులైనవారి, మంత్రులు, ఆంతరంగికులవంటివారి పరిచయం కల్గవచ్చు. వారిద్వారా దుర్లభమైన, అభ్యర్థితమైన రాజదర్శనమే లభిస్తే లభించవచ్చు. ఒకవేళ, నేరుగా రాజదర్శనమే లభిస్తే ఇక చెప్పవలసినది లేదు కదా! "రాజైవ దృష్టః" ఇత్యాది లౌకికప్రయోగాలు ఇక్కడ ఉదాహరణాలు. ఇక్కడ రాజుస్థానంలో భాగవతులను, రాజదర్శనానికి సహాయపడేవారి స్థానంలో భగవంతుని చెప్పాలి.

వికల్పం గ్రహిస్తే "ద్వే ఫలే" అనేది కుదరదు. సముచ్చయం గ్రహిస్తే "కదాచిత్" అనే పదప్రయోగం కుదరదు. అందువల్ల,

“ఏకవృంతగతఫలద్వయ” (ఒకే గుత్తికి ఉండే రెండు ఫలాల) న్యాయంలో, ఇక్షుకాండ పర్వన్యాయంలో (చెరకు గడలోని కణుపులు) అర్థాన్ని ఇక్కడ నిర్వహించాలి. ప్రాప్యంలో ప్రథమావధి భగవచ్ఛేషత్వమని, చరమావధి భాగవత శేషత్వమని తెలియాలి. ఒకే చెఱకు గడలోని రెండు కణుపులవంటివే, ఇవి. అందువల్ల, ఈ రెండు ప్రాప్యంలోని రెండు దశలు మాత్రమే తప్ప, వేఱు కాదు. అయితే భగవద్భక్తి అనేది ఆ స్వామికి గల పరత్వాన్ని చూచినందువల్ల కల్గిన భయంవల్ల కాని, సౌలభ్యాన్ని చూచినందువల్ల కల్గిన ప్రీతివల్ల కాని ఏర్పడవచ్చు. కానీ, మనవలెనే ఈ లోకంలో సంచరించే భాగవతులపట్ల భక్తి కల్గడం చాలా అరుదు. వారు "శిఱుమామనిశర్” (ఆకారంలో చిన్నవారైనా, మహిమలో గొప్పవారు) అనే విశ్వాసం కల్గడం దుర్లభం. పరత్వభావన ఇంకా దుర్ఘటం. అందువల్ల అది అభ్యర్థితం. అది కల్గితే, అరుదైన ప్రాప్యసిద్ధి కల్గినట్లే. “జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్” అన్నట్లు భాగవతులు భగవానునకు ఆత్మస్థానీయులు కనుక, వారిపట్ల ఉండే భక్తి భగవద్భక్తియొక్క పరిణత దశయే. ఈ విధంగా భగవద్భక్తి, భాగవత భక్తి - అనేది ఒకే గుత్తిలోని రెండు ఫలాలవంటివి. ఈ భావాన్ని ఈడులోని "ప్రాప్యత్తిల్ ప్రథమావధి - భగవచ్ఛేషత్వత్తళవిలే నిఱ్కై చరమావధి భాగవత శేషత్వత్తళవిలే నిఱ్కై” (ప్రాప్యంలో మొదటి దశ భగవానునకు శేషమై ఉండడం, చరమ - చివరి - దశ భాగవతులకు శేషమై ఉండడం) అనే వాక్యం వివరిస్తున్నది. చెఱకు గడలోని కణుపులకు పర్వాలని పేరు. చెఱకు గడలోని మొదటి కణువు (పర్వం)లో తీపి తక్కువగా ఉంటుంది.

అంతకంటే, చివరి కణువులో తీపి ఎక్కువగా ఉంటుంది. ఆ విధంగానే, భగవచ్ఛేషత్వంలోని మాధుర్యం కంటే, భాగవత శేషత్వంలోని మధురిమ అధికం. ఎందుకంటే – అది భగవచ్ఛేషత్వ పురస్కృతమై ఉంటుంది కనుక. అందువల్ల, సంప్రదాయంలో భగవచ్ఛేషత్వానికి ప్రథమపర్వమని, భాగవతశేషత్వానికి చరమపర్వమని పేరు. ఈ వ్యపదేశంలో భాగవత శేషత్వంలో ఆచార్యశేషత్వం కూడా అంతర్భవిస్తుందని తెలియాలి. ఆచార్యులు కూడా భగవద్భక్తులే కదా. భాగవతశేషత్వం మధ్యమ పర్వమని, ఆచార్యశేషత్వం చరమపర్వమని చెప్పబడుతుంది. ఈ విధంగా పల్కడం - వారు చేసే ఉపకారాలలోని తారతమ్యాన్ని బట్టి, ఇక్కడ, ఏకవృంతగత ఫల ద్వయన్యాయం కంటే, ఇక్షుకాండపర్వన్యాయమే ఎక్కువ సరసం. ఎందుకంటే - ఒకే గుత్తిలోని రెండు ఫలాలు మాధుర్యంలో తౌల్యాన్ని కల్గి ఉండవచ్చు. అపుడు మాధుర్యంలో తారతమ్యాన్ని కల్గిన ప్రథమ - చరమ పర్వాలకు అవి దృష్టాంతం కాలేవు.

భగవద్రామానుజులు చూపిన భాగవతశేషత్వంయొక్క అభ్యర్హితత్వం - ఈడు వ్యాఖ్యలో నమిళ్ళై "ఎమ్మై ఆళుమ్ పరమరే" (మమ్మలను దాసులుగా గ్రహించే స్వాములు) అనే మొదటి పాశురంలోని చివరి ప్రయోగాన్ని వ్యాఖ్యానిస్తూ "మున్బు అవనై - పరమన్ ఎన్ట్రీర్. ఇఙ్గే ఇవర్ కళై - పరమర్ - ఎన్టానిస్ట్రీర్. -ఇదిరుక్కుమ్బడి ఎన్? ఎన్నిల్, అనుభావ్యగుణత్తాలే శొల్లి*ఱ్ఱు*, అఙ్గ. ఇఱ

జ్ఞ అగ్గుణత్తుక్కు తోఱ్ఱవర్ గళై చ్చొల్లుకిఱదు" (పూర్వం భగవంతుని శేషి అన్నారు. ఇక్కడ భాగవతు లను శేషిభూతులంటున్నారు. ఈ రెండు ఏవిధంగా పొసగుతాయి? అంటే, భగవద్విషయంలోని శేషిత్వం అనుభవించే కల్యాణగుణాల ఆధిక్యంతో చెప్పబడింది. ఇక్కడ, ఆ గుణాలకు జితులైన భాగవతుల శేషిత్వం చెప్పబడింది) అని అనడం, నీటిని వివరించే అరుంబదంలో - "ఇత్తాల్ - భగవచ్ఛేషత్వమ్ గుణకృతమ్, భాగవత శేషత్వం స్వరూపప్రయుక్త మెను కరుత్తు" (ఇందువల్ల, భగవచ్ఛేషత్వం భగవంతునిలోని గుణాల వల్ల ఏర్పడింది. భాగవత శేషత్వం సహజంగానే ఏర్పడింది– అని భావం) అని విశదీకరించడంవల్ల వ్యక్తమవుతున్నది.

మఱి, భాగవత శేషిత్వం స్వరూప ప్రయుక్తమని అంటే, భగవానుడే నిరుపాధికశేషి - అనే వైదికసిద్ధాంతానికి భంగం రాదా! - అనే సందేహం ఇక్కడ కలుగవచ్చు. ఇక్కడ ప్రకరణం – భాగవత శేషిత్వవైభవవర్ణనపరం కనుక, ఇది అంతా చెప్పబడింది. కనుక, "న హినిందాన్యాయం" లో ప్రకృతార్థాన్ని గ్రహించాలి. అంతేకాక, "జ్ఞానీత్వాత్మైవ మే మతమ్" (జ్ఞాని అయితే నాకు ఆత్మవంటివాడు), "భక్తా స్తేఽ తీవ మే ప్రియాః" (భక్తులు నాకు చాలా ఇష్టమైనవారు) ఇత్యాది భగవదభిమతానుసారంగా భాగవతశేషిత్వ శరణ్యత్వాదివైభవం ప్రకృతంలో కీర్తింపబడిందనికూడా గ్రహించడంలో అడ్డులేదు. "ఉద్దేశ్యన్దానే ఇజ్జే సిద్దిక్కుమ్ కాణ్!" అనే శ్రీరామానుజుల సూక్తితాత్పర్యం ఇదే. "వా" అనే పదానికి ఏవకారార్థం

ప్రయోగంలో ఉన్నదనే విషయాన్ని “స్యు రేవ తు పునర్వ్యైవేత్యవధారణవాచకాః” అనే నామనిఘంటువచనం ప్రమాణీకరిస్తున్నది.

శ్రీరామానుజులు చేసిన ఇటువంటి పలు అందమైన నిర్వాహాలు మనకు దివ్య ప్రబంధం వ్యాఖ్యానాలలో చాలా చోట్ల గోచరిస్తాయి.

సాంప్రదాయిక వ్యాస మాలిక–15

# భగవంతుని కృతజ్ఞతాగుణం

(కాంచీ మహా విద్వాన్ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారి ద్రావిడ వ్యాసానికి అనువాదం)

భగవంతునకు కల అనేక కళ్యాణ గుణాలను అన్నిటినీ కలిపి శ్రీయామునులు స్తోత్రరత్నంలో ఒకే శ్లోకంలో అనుగ్రహించారు. " వశీ వదాన్యో గుణవాన్ ఋజుః శుచిః" అని ఆ శ్లోకం ఆరంభం అవుతున్నది. అందులో, "కృతజ్ఞః "అనే ఒక గుణం ప్రస్తావించబడినది. చేసిన మేలును మరచిపోనివానికి కృతజ్ఞుడు అని పేరు. మానవులకు ఉండవలసిన గుణాలలో ఈ గుణమే చాలా ప్రధానమైనది. "కృతఘ్నే నాస్తి నిష్కృతిః" అనేది సూక్తి. పాపాలను అన్నిటిని ప్రాయశ్చిత్తంతో పోగొట్టుకోవచ్చు, కానీ, చేసిన మేలును మరచి పోవడం అనే పాపానికి మాత్రం ప్రాయశ్చిత్తం ఏ శాస్త్రంలోనూ ఏమీ లభించదు –అని అందరి చేత ఏకకంఠంగా చెప్పబడింది.

ఈ కృతజ్ఞత అనే గుణం మనవంటి మానవులకు తప్పక ఉండవలసిన గుణం. సరే. భగవంతునకు ఈ గుణం ఉండవలసిన అక్కర ఉన్నదా? మనం, పరస్పరం ఒకరికి ఒకరు సహాయాలను చేసుకొనేవారం, ఒకరి నుంచి ఇంకొకరు సహాయాన్ని కోరేవారం, కనుక, మన సహాయాన్ని ఇతరులు మరచిపోకుండా ఉండడం, ఇతరులు మనకు చేసిన సహాయాన్ని మనం మరచిపోకుండా ఉండడం అనేది ఆవశ్యకం అవుతున్నది. అయితే, మనవలె భగవంతునకు ఆవశ్యకమైన

సహాయం ఎవరి నుండి, ఏ విధంగానూ అణుమాత్రం కూడా పొందవలసిన అక్కరలేదే. అతడు అవాప్తసమస్త కాముడుకదా. కనుక, అతనికి మనం చేయవలసిన సహాయం అనేది ఏమి ఆవశ్యకమై ఉంటుంది కనుక? ఏమీ ఉండదు –అనేది పునరుక్తం. అందుచేత, ఆ భగవంతుని కృతజ్ఞుడు అని కీర్తించడానికి విషయమే లేదు కదా. ఒకవేళ, విషయం ఉన్నది అంటే, భగవంతుడు మన వంటి క్షుద్రుల దగ్గర నుండి సహాయాన్ని ఎదురు చూడవలసినవాడు –అని ఆ స్వామికి కొరత చెప్పినట్లే కాగలదుకదా. అందుచేత, ఆ స్వామికి గుణంగా చెప్పబడిన కృతజ్ఞతను ఏ విధంగా నిర్వహించడం? అని కొందరు సందేహ పడతారు.

శ్రీయామునులు భగవంతుని గుణంగా అనుసంధించిన కృతజ్ఞతను నిర్వహించే మన పూర్వాచార్యులు " న స్మరత్యపకారాణాం శతమప్యాత్మవత్తయా, కథంచిదుపకారేణ కృతేనైకేన తుష్యతి" అనే శ్రీరామాయణ శ్లోకాన్ని పురస్కరించుకొని నిర్వహించడం మనం గమనిస్తున్నాము. ఈ శ్లోకం శ్రీరాముని కృతజ్ఞతా గుణాన్ని చక్కగా వ్యక్తం చేస్తున్నది. ఏదైనా ఒక విధంలో, ఎవరైనా ఒక ఉపకారం చేస్తే, దానివల్ల శ్రీరాముడు ఎప్పుడూ కూడా మనసులో ఆనందాన్ని పొందుతాడని, వందల సంఖ్యలో అపకారాలను చేసినా, వాటిని కొంచెం కూడా మనసులో భావించడని ఈ శ్లోకంలో శ్రీరాముని గుణాతిశయం చెప్పబడింది. ఇందులో "కథంచిత్" అని మునుముందుగా ప్రయోగింపబడిన పదం గమనించదగినది. ఉపకారం చేయాలి –అనే భావంతో చేయడం కాకుండా, అబుద్ధిపూర్వకంగా చేసినప్పటికీ కూడా, దానిని కూడా శ్రీరాముడు చాలా

గొప్ప ఉపకారంగా భావించి, ఆనందపడతాడట. మనః పూర్వకంగా అపకారాలను వందల సంఖ్యలో చేసినప్పటికీ, వాటిని మనస్సులో భావించడట.

అయితే, ఇక్కడ ఒకటి చెప్పవలసి ఉన్నది. " వెఱిదే అరుళ్ శెయ్ వర్" (భగవంతుడు నిర్హేతుకంగానే అనుగ్రహిస్తాడు) అని ఆళ్వారులు పలికినట్లుగా, ఏ ఉపకారాన్ని చేయనివారికి కూడా చాలా గొప్పదైన అనుగ్రహాన్ని చేసే భగవంతుడు ఒక ఉపకారాన్ని చేసినవారి విషయంలో ఆనందపడతాడు– అని అంటే, ఇది గొప్ప విషయమా! ఇది లెక్కించదగిన ఒక గుణం అవుతుందా? కానే కాదు కదా. అయినప్పటికీ, శ్రీరాముడు తనను ఒక మానవునిగా భావించి వర్తించాడు కనుక, లోకంలో మానవుల విషయంలో కనిపించే గుణాలు అన్నీ శ్రీరామునిలో ఉన్నాయి– అని తెలుపవలసి ఉన్నందున, ఆ క్రమంలో ఈ విధంగా చెప్పవచ్చు కదా.

గమనించండి. వానరులకు ప్రభువైన సుగ్రీవుని విషయంలో, రాక్షసులకు ప్రభువైన విభీషణుని విషయంలో శ్రీరామచంద్రుడు ప్రదర్శించిన అనుగ్రహం నోటితో వర్ణించి చెప్పడానికి సాధ్యం కానిది. మనసుతో భావించడానికి కూడా వీలుకానిది. దానికి తగినట్లు వారు చేసిన ఉపకారం ఏది? అని గమనించి చూచినప్పుడు, విభీషణుడు శరణాగతి చేశాడని చెప్పడానికి అవకాశం ఉన్నది. కానీ, సుగ్రీవుని విషయంలో అయితే, " లోకనాథః పురా భూత్వా సుగ్రీవం నాథ మిచ్ఛతి" అని, " సుగ్రీవం శరణం గతః "అని ఉండే ప్రమాణాలను అనుసరించి,

శ్రీరాముడు సుగ్రీవుని శరణు పొందాడు అని గమనిస్తున్నామే తప్ప, సుగ్రీవుడు శ్రీరాముని శరణు పొందినట్లుగా కనబడడం లేదు. అయినప్పటికీ, ఆ శ్రీరాముని మనసులో సుగ్రీవుడు చాలా గొప్ప ఉపకారం చేసినట్లుగా భావింపబడింది. ఆ సహాయం ఏమి? అంటే, ఈ రాముడు సీతను విశ్లేషించి బాధపడి ఏమి చేయాలో తెలియకుండా ఉండే సమయంలో, "పంపా తీరే హనుమతా సంగతో వానరేణ హ" అనే విధంగా పంపానది తీరంలో హనుమంతుడు వచ్చి శ్రీరాముని కలిశాడు కదా. అది సుగ్రీవుని ఆజ్ఞ వల్లనే కదా జరిగింది. హనుమంతుడు శ్రీరాముని దగ్గరకు వచ్చి చేరినా, "నేను సుగ్రీవునిచే పంపబడినవాడనై ఇక్కడకు వచ్చాను, మిమ్ములను కలువడం కోసం వచ్చాను " అనే చెప్పాడు. ఇటువంటి మహా గుణశాలి అయిన హనుమంతుని పంపినది సుగ్రీవుడు తన కార్యం కోసం అయినప్పటికీ, శ్రీరాముడు ఆ విధంగా భావించకుండా, దానిని తనకు చేసిన మహోపకారంగా భావించే, అంటే, తనకు సహాయంగా పంపినట్లుగా భావించే, సుగ్రీవుని విషయంలో గొప్ప అనుగ్రహాన్ని ప్రదర్శించాడు.

ఇటువంటి కథాసందర్భాలను పురస్కరించుకొని, శ్రీరాముని విషయంలోనే మనం కృతజ్ఞతా గుణాన్ని నిరూపించడం అనేది అటు ఉండనివ్వండి. శ్రీయామునులు ", వశీ వదాన్యః" అనే శ్లోకంలో అనుసంధించిన కళ్యాణ గుణాలు పరంధాముడైన శ్రీమన్నారాయణుని విషయంలోనే కనుక, ఆ గుణాలలో ఒకటి అయిన కృతజ్ఞతను ఆ శ్రీమన్నారాయణుని విషయంలోనే నిరూపించి చూపించాలి. దానిని మన

ఆచార్యులు నిరూపించి చూపించిన రీతి చాలా ఆశ్చర్యకరమైనది. ఇక, దానిని నిరూపిస్తాను.

"కృతజ్ఞః" అనే పదం "కృతం జానాతి ఇతి కృతజ్ఞః" అనే వ్యుత్పత్తి ప్రకారం, "చేసిన కార్యాలను తెలుసుకునేవాడు" అనే అర్థాన్ని ఇస్తుంది. భగవంతుడు కృతజ్ఞుడు అంటే, జీవులమైన మనం చేసే కార్యాలను భగవంతుడు తెలిసికుంటున్నాడు–అని అర్థం. అనంత కోటి జీవరాసులు ప్రతిక్షణంలోను చేసే కార్యాలను భగవంతుడు తన గొప్ప శక్తి విశేషంతో మన వెంటనే ఉండి, తెలుసుకుంటున్నాడు అనేది చాలా ఆశ్చర్య పడదగిన విషయం కదా. ఇక్కడ చెప్పబడుతున్నది ఆ విషయమేనా? అని అంటే, వినండి.

సర్వేశ్వరుడు మనవంటి జీవులను తన అనుగ్రహానికి లక్ష్యం చేయడం కోసం తగినట్లుగా మనం చేయవలసిన కార్యాలను శాస్త్రాలలో పలు విధాలుగా తెలియజేశాడు– అనే విషయం అందరూ తెలిసినదే. ఆ కార్యాలకు సుకృతమని సామాన్యమైన పేరు. చక్కగా చేయబడినది– అని దీని అర్థం. మనం చేసే కార్యాలు, చక్కగా చేయబడే కార్యాలు, తప్పుగా చేయబడే కార్యాలు– అని రెండు విధాలుగా ఉంటాయి కదా. వాటికి సంస్కృతంలో సుకృతాలు అని, దుష్కృతాలు అని పేరు. ప్రస్తుతంలో సుకృతాలే వివక్షితాలు. వాటిని గురించి ప్రస్తావిస్తాను.

ఈ సుకృతాలు రెండు విధాలుగా ఉంటాయి. జ్ఞాతసుకృతాలు అని, అజ్ఞాత సుకృతాలు అని ఇవి రెండు విధాలు. మనః పూర్వకంగా చేయబడే సుకృతాలు జ్ఞాత సుకృతాలు అనబడతాయి. మనకు

తెలియకుండానే సంభవించే సుకృతాలు అజ్ఞాతసుకృతాలు అనబడతాయి. వీటిలో, మొదటి ప్రకారం అయిన జ్ఞాత సుకృతాలు పలు విధాలుగా ఉంటాయి. తపస్సు చేయడం, దానం చేయడం, యజ్ఞయాగాదులను చేయడం, గంగ, యమున, కావేరి, గోదావరి మొదలైన పుణ్య తీర్థాలలో స్నానం చేయడం, శ్రీరంగం, తిరుమల, కాంచీపురం, తిరునారాయణపురం మొదలైన దివ్య దేశాలకు వెళ్లి అక్కడ నెలకొని ఉండే భగవన్మూర్తులను సేవించడం, "పేరాయిరమ్ ఓదుమిన్ గళ్" (సహస్రనామాలను అనుసంధించండి) అనే ఆజ్ఞను అనుసరించి సహస్రనామస్తోత్రం మొదలై స్తోత్రాలను నోరార అనుసంధానం చేయడం, దీపారోపణను చేయడం, పూలమాలలను కట్టి సమర్పించడం– అని చెప్పబడే పలు విధాలైన కార్యాలను చేయడం. ఇటువంటి కార్యాలను చేయాలి అనే సంకల్పించి మనఃపూర్వకంగా చేయడం అనేది జ్ఞాత సుకృతం అనబడుతుంది.

ఇంతకు ముందు చెప్పినట్లుగా "ఈ సుకృతాన్ని చేయాలి" అని మనం సంకల్పించి చేయనప్పటికీ, అసంకల్పితంగా సుకృతాలుగా పరిణమించే కార్యాలు అజ్ఞాత సుకృతాలు అనబడతాయి. "ఈ మంచి కార్యాన్ని చేయాలి" అని భావించి చేయని కార్యాలను సుకృతాలు అని చెప్పవచ్చునా? శాస్త్రాలలో విధింపబడినదై, కర్త అయిన జీవుని చేత బుద్ధిపూర్వకంగా ఆచరింపబడినది అయిన కార్యాన్ని కదా, సుకృతం అని వ్యవహరించవచ్చు. "ఈ సుకృతాన్ని చేశాను" అని కర్త అయిన జీవుడు తెలియని వానిని సుకృతాలు అని వ్యవహరించవచ్చునా? అని ఇక్కడ

ఆక్షేపించే అవకాశం ఉన్నది. ఇక్కడ ఈ ప్రశ్నకు మన పూర్వాచార్యులు అనుగ్రహించే సమాధానాన్ని తెలియజేస్తాను.
శ్రీవచనభూషణ దివ్య గ్రంథంలో, భగవన్నిర్హేతుకకృపాప్రకరణంలో (396) "శాస్త్రమ్ విధియాదే, నాముమ్ అఱియాదే ఇరుక్కిఱ ఇత్తై సుకృతమ్ ఎన్టు పేరిట్టుకిఱపడి ఎన్? ఎన్నిల్, నామన్టు, ఈశ్వరనెన్టు కేట్టిరుక్క్యోయాయిరుక్కుమ్" (శాస్త్రం విధించకుండా మనం తెలియకుండా ఉండే ఈ కార్యాలను సుకృతం అని వ్యవహరించడం ఏ విధంగా? అని అంటే, వీటిని సుకృతం అని అన్నది మనం కాదు, భగవంతుడు అన్నాడు– అని పెద్దలు చెప్పగా మేము విన్నాము) అని ఉన్నది.

మనకు తెలియకుండా సంభవించిన కార్యానికి సుకృతం అని పేరు పెట్టడం మనం కాదు. సర్వముక్తి ప్రసంగం– అనే దోషం రాకుండా ఉండడం కోసం, సర్వేశ్వరుడైన భగవంతుడే వీటికి తానే సుకృతం అని పేరు పెట్టాడు –అని మన పూర్వాచార్యులు అనుగ్రహించారు. ఇందుచేత ఏమి స్పష్టపడుతున్నది? అని అంటే, మనకు తెలియకుండా ఉన్నప్పటికీ, భగవంతుడు వాటిని తెలుసుకున్నందున, ఆ భగవంతుని అభిప్రాయాన్ని అనుసరించి ఆ కార్యాన్ని సుకృతం అని అనడంలో ఏ లోటు లేదు– అని స్పష్టమవుతున్నది.

ఇప్పుడు, ఇక్కడ మళ్ళీ ఇంకొక సందేహం కలుగుతుంది. భగవంతుడు అయితే, యథార్థ జ్ఞానం కలవాడు. ఆ స్వామికి అన్యథాజ్ఞానం, విపరీత జ్ఞానం అనేవి లేవు– అని శాస్త్రాల ద్వారా తెలుసుకుంటున్నాము. పైన తెలియజేసిన విధంగా చేతనులు

తెలియకుండా చేసిన కార్యాలను భగవంతుడు సుకృతాలు– అని భావించడం యథార్థజ్ఞానం అవుతుందా? ఒకడు సన్నిపాతజ్వరం మొదలైన తీవ్రమైన వ్యాధుల చేత బాధపడే సమయంలో, తనకు తెలియకుండా ఏదేదో మాట్లాడతాడు. అబుద్ధి పూర్వకంగా నోటి నుండి బయటకు వచ్చే ఆ జల్పాలలో ఏదైనా అర్థాన్ని గమనించగలమా? లేదు కదా! ఆ విధంగానే, మనకు తెలియకుండా మనం చేసే కార్యాలను భగవంతుడు సుకృతాలు అని ఏ విధంగా గ్రహిస్తాడు? గ్రహించడం తగినది? అనేది ఆ ప్రశ్న.

దీనికి సమాధానం వినండి.

భగవంతుడు చేతనుల విషయంలో సహజమైన కృపను కలవాడు. ఇతనిని ఏవిధంగా అయినా అంగీకరించి అనుగ్రహించడానికి ఆ స్వామి మార్గాన్ని అన్వేషిస్తాడు. ఈ జీవుడు బుద్ధిపూర్వకంగా చేసే సుకృతాలను పురస్కరించుకొని మాత్రమే ఇతని అంగీకరించాలని భగవంతుడు అనుకుంటే, ఒకరిని కూడా అంగీకరించి అనుగ్రహించే అవకాశం కలుగదు. ఎందుకంటే, మనం బుద్ధిపూర్వకంగా చేసేవి పాపాలే కనుక, మనం ఏ సమయంలోనూ సుకృతాన్ని మనస్సుతో భావించి చేసేవారం కాదు కనుక, మనలను అనుగ్రహించడానికి భగవంతునకు అవకాశం ఎక్కడ ఉంటుంది? మనం నశించిపోయి, అతడు కూడా మనలను కోల్పోవలసివస్తుంది. మన నశించి పోవడం అటు ఉండనివ్వండి. "మనం పాడైపోతున్నామే!" అనే చింత కూడా లేకుండా ఉండే మనం మన నాశాన్ని గూర్చి చింతించకుండా ఉన్నప్పటికీ,

సౌత్తుకు కలసౌత్తుదారుడై, స్వామి అనే పేరును పొందిన భగవంతుడు మనలను కోల్పోయి నిలువలేడు కదా. "సుకృతాన్ని చేసినవారిని తప్ప, మిగిలినవారిని నేను అంగీకరించను" అని శాస్త్రాలలో అతడు ఒక నియమాన్ని ఏర్పాటు చేసినందున, సుకృతాన్ని చేసినవారిని తప్ప, చేయనివారిని అంగీకరించే అవకాశం లేదు అందుచేత భగవంతుడు మనలను కోల్పోవలసి ఉంటుంది ఆ విధంగా కోల్పోకుండా ఉండడం కోసం ఆ స్వామి ఒక దొంగ దారిని వెతుకుతున్నాడు. అది ఏమంటే కరోనా కళేబరాలను పొందిన జీవులు ఏ క్షణంలోనూ ఊరికే ఉండరు. " న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్" (ఎవడు ఏ క్షణంలోనూ ఏ పని చేయకుండా ఉండడం లేదు) అని గీతలో చెప్పిన విధంగా ఎల్లప్పుడూ ఏదో ఒక కార్యాన్ని చేస్తూ కాలాన్ని గడిపే జీవుడు చేసే కార్యాలలో మనం మంచి అని పేరు పెట్టి వ్యవహరించే రీతిలోని కార్యం ఏదైనా ఉంటుందా! చూద్దాం !అని భగవంతుడు వెతకడం ఆరంభిస్తాడు. ఆ స్వామి అదృష్ట విశేషం చేత అటువంటి కార్యాలు మన దగ్గర అతనికి కొన్ని లభించవచ్చు. వాటిని అతడు సుకృతాలుగానే భావిస్తాడు. మనం మనః పూర్వకంగా సుకృతం అని భావించి చేయనందున అజ్ఞాతాలు అనబడుతున్నవి. ఆ భగవంతుని అభిప్రాయం ప్రకారం అవి సుకృతాలుగా భావించబడినందున సుకృతాలు అనబడుతున్నది. అందుచేత అటువంటి కార్యాలు అజ్ఞాత సుకృతాలు అని వ్యవహరించబడుతున్నాయి.

ఈ అజ్ఞాత సుకృతం అనేది యాదృచ్ఛిక సుకృతం అని, ఆనుసంగిక సుకృతం అని, ప్రాసంగిక సుకృతం అని పలు పేర్లను కలిగినవై

ఉంటాయి. ఇవి మన వంటివారి దగ్గర భగవంతునిచే ఏ విధంగా గ్రహింపబడుతున్నాయి? అనే విషయాన్ని కొంచెం వివరించి పలుకుతాను.

మనం సంసారులం కనుక సంతానాన్ని పొందుతున్నాము. ఒకని సంతానానికి వివాహం చేయాలనే సందర్భం వస్తుంది. అందుకోసం శ్రీరంగంలో ఉండే ఒక వరునకు మన పుత్రికను ఇచ్చి వివాహం చేసే సందర్భం, ఆ విధంగానే, తిరువెళ్లఱై క్షేత్రంలో ఉండే కన్యను మన కుమారునకు ఇచ్చి వివాహం చేసే సందర్భం ఏర్పడినది అని అనుకోండి. అప్పుడు ఆ సంసారి మాటిమాటికి మాట్లాడే సమయంలో శ్రీరంగ క్షేత్రాన్ని గూర్చి, తిరువెళ్లఱై క్షేత్రాన్ని గూర్చి నోటితో ప్రస్తావించే ఆవశ్యకత ఏర్పడుతుంది. " నా అల్లుడు శ్రీరంగంలో ఉన్నాడు, శ్రీరంగం నుండి నా అల్లుడు నిన్న ఇక్కడకు వచ్చాడు, అల్లుని తీసుకొని రావడం కోసం శ్రీరంగానికి వెళ్ళబోతున్నాను, మా కోడలు తిరువెళ్లఱై దివ్యదేశంనుండి ఈనాడు వచ్చింది" కానీ ఈ విధంగా అనేక పర్యాయాలు వ్యవహరించే సందర్భం ఏర్పడుతున్నది ఈ వ్యవహారాలలో శ్రీరంగాన్ని గూర్చి తిరువెళ్లఱై దివ్య దేశాన్ని గూర్చి మాటిమాటికి చెప్పడం అనేది " ఈ దివ్యదేశాలను గూర్చి మనం చెబితే సుకృతం ఏర్పడుతుంది" అనే భావంతో కాదు. అంబత్తూర్, ఆవడి అని ఏవో కొన్ని ఊరి పేర్లను చెప్పినట్లే, శ్రీరంగం, తిరువెళ్లఱై అని ఈ సంసారి చెబుతున్నాడు, అంతే. అయినప్పటికీ కూడా, ఏదైనా ఒక నెపాన్ని ఎదురు చూడడంలో దృష్టిని

కలిగినవాడైన భగవంతుడు "వీడు నా ఊరి పేర్లను చెప్పాడు" అని దీనిని ఒక సుకృతంగా లెక్క పెడతాడు.

ఇంతే కాదు, ఇంకా వినండి. ఒః సంసారికి కలిగే సంతానానికి అతడు రంగడు, రాఘవుడు, వేంకటేశ్వరుడు, గోవిందుడు, గోపాలుడు, నారాయణుడు, మాధవుడు అని ఈ విధంగా పేర్లను పెట్టి, ఆ కుమారులను ఆదరంగా పిలిచినప్పుడు అంతా ఈ పేర్లను ఉచ్చరించి పిలవడం జరుగుతున్నది. ఇంతేకాక, మాటల సందర్భంగా " రంగడు వచ్చాడు, రాఘవుడు వెళ్ళాడు, కృష్ణుని చూశాను, రామునితో మాట్లాడాను" అని ఈ విధంగా అనేక పర్యాయాలు మాట్లాడే సందర్భం ఏర్పడుతున్నది. " భగవంతుని తిరునామాలను చెబుతున్నాను" అనే భావం కొంచెం కూడా లేకుండా ఈ విధంగా సంభవించే సంసారుల వ్యవహారాలలో భగవంతుడు "వీడు నా పేర్లను చెప్పాడు" అని దీనిని కూడా ఒక సుకృతంగా లెక్కపెడతాడు.

కొందరు భాగవతులు శ్రీ వేంకటాచల యాత్రగా ప్రయాణం చేసే సందర్భంలో, వారిని కొట్టి, వారి వస్తువులను దొంగిలించాలని కొందరు దొంగలు వారి దగ్గరకు వచ్చారు. అదే సమయంలో, కొంతమంది రాజసేవకులు తమ పని కోసం ఆయుధాలను ధరించి, ఆ దారిలోనే వారి వెనకాల రావడం దొంగలు గమనించారు. "ఈ భటులు ఈ భాగవతులకు అంగరక్షకులుగా వస్తున్నారు కాబోలు! ఇక్కడ మనం ప్రయత్నం ఏమీ సాగదు" అని భావించి వారు పక్కకు తొలగిపోతారు. ఈ సందర్భం అక్కడకు యాదృచ్ఛికంగా వచ్చిన రాజసేవకులకూ తెలియదు. యాత్రకు

వెళుతున్న భాగవతులకూ తెలియదు. అయినప్పటికీ, అంగీకరించాలని అవకాశం కోసం ఎదురుచూచే భగవంతుడు ఆ రాజసేవకులను భాగవత రక్షణ చేసిన సుకృతాన్ని కలవారుగా భావిస్తాడు. ఆ రాజసేవకులు భాగవతులు వెళ్లేదారిలో ప్రయాణం చేయడం అనే ఒక విషయాన్ని ఒక సుకృతంగా భగవంతుడు భావిస్తాడు.

ఒకడు ఒకచోట భూమిని కొని ఆ భూమిలో ఉల్లిపాయలు వెల్లుల్లి మొదలైన వాటిని పైరు చేస్తాడు ఆ పంటకు నీరు పెట్టడం కోసం అక్కడ సౌకర్యం లేనందున సారా దూరంలో ఉండే జలాశయం నుండి తూములను తవ్వి దాని ద్వారా నీరు ప్రవహించేటట్లు చేస్తాడు ఆ నీరు ఒక పెద్ద కాలువగా ప్రవహించి పంట భూమికి పారుతున్నది యాత్రగా వెళుతున్న కొందరు భాగవతులు దాహంతో బాధపడినవారై తమ దాహాన్ని తీర్చుకోవడం కోసం చన్నీరు ఎక్కడా దొరకనందున, చల్లటి నీటి కోసం వెదకుతున్న సమయంలో, వారు చల్లగా నీరు తిని ప్రవహించే కాలువను చూచి పరమానందంతో కాళ్ళను చేతులను కడిగి కొని, తమ దాహాన్ని తీర్చుకొని తమ శ్రమను తీర్చుకుంటారు. ఈ చోటుకు చాలా దూరంలో ఉండి, చెరువు నుండి నీటిని ప్రవహింప చేస్తున్న రైతు దీనిని కొంచెం కూడా తెలియకుండా ఉన్నప్పటికీ, సర్వజ్ఞుడైన భగవంతుడు "నా భక్తుల దాహాన్ని వీడు తీర్చాడు "అనే భావించి, దీనిని ఒక సుకృతంగా లెక్క పెడతాడు.

ఒక ధనికుడు తాను జూదాన్ని, చదరంగాన్ని ఆడడం కోసం ఒక విశాలమైన చావడిని కట్టి, అందులో జూదాన్ని, చదరంగాన్ని ఆడుతూ

కాలాన్ని గడుపుతున్నాడు. అయితే రాత్రివేళ అంతా జూదాన్ని ఆడి కాలాన్ని గడపడం వీలు కాదు కదా అర్ధరాత్రి వరకు జూదమాడి నిద్రపోవడం కోసం అతడు ఇంటికి వెళ్ళాడు. ఆ సమయంలో యాత్రగా ఆ దారిలో నడిచి వెళుతున్న కొందరు పరమ భాగవతులు తాము శయనించడం కోసం తగిన చోటు ఎక్కడా దొరకనందున, అందుకోసం వెతుకుతూ వచ్చి, ఈ చావడిలో విశ్రమించడం జరిగింది. ఈ విధంగా ఒకనాడు కాదు ప్రతి దినం ఈ విధంగా జరిగింది దీనిని ఆదనికుడు ఎంత మాత్రం తెలియదు తెలిసినట్లయితే ఎవ్వరూ ఆచావడి లోపల రాకుండా ఉండే విధంగా తలుపులు పెట్టడం చేసి ఉండేవాడు ఈ విధంగా కొందరు భాగవతులు ఆచావడిలో విశ్రమించి వెళుతున్నారు అనే విషయాన్ని అతడు తెలియకుండానే ఉన్నందున ఆ చావడికి ఏ విధమైన తలుపులు పెట్టబడలేదు యాత్రగా వెళ్లే వారికి ఇది చాలా ఆనందకరమైన వసతి అయినది. ఇది భగవంతుని హృదయంలో పడినది. " నా భక్తులకు విశ్రమించడానికి నీడను ఇతడు ఇచ్చాడు" అని దీనిని ఒక సుకృతంగా అతడు భావిస్తాడు.

ఒకడు గోహత్యను చేసే తన జీవితాన్ని గడుపుతున్నాడు. అతడు ఒకనాడు ఒక గోవును చూసి, దానిని పట్టుకొని చంపాలని అనుకొని, దానిని వెంబడించాడు. ఇతనిని గమనించిన ఆ పశువు భయపడి పరిగెత్తడం ఆరంభించింది. దానిని వదిలి పెట్టకుండా, దానిని వెంబడించి పరుగెత్తాడు. పశువు పరిగెత్తే దారిలో ఒక భగవంతుని ఆలయం ఉన్నది. ఆ గోవు ఆ ఆలయం చుట్టూ పరుగు తీసింది. దానిని

వెంబడిస్తూ ఆ కిరాతకుడు కూడా ఆలయం చుట్టూ పరిగెత్తాడు. ఆ సమయంలో " నేను ఒక భగవదాలయానికి చుట్టూ పరుగు తీస్తున్నాను, ప్రదక్షిణం చేస్తున్నాను, ఇది ఒక సుకృతం"అనే జ్ఞానం అతనికి లేదు. కోవెలకు ప్రదక్షిణం చేయడం ఒక సుకృతం– అనే ఆలోచన అతనికి లేదు. అయినప్పటికీ, అవకాశం కోసం ఎదురు చూసేవాడైన భగవంతుడు "వీడు నా ఆలయానికి ప్రదక్షిణం చేశాడు" అని దీనిని కూడా ఒక సుకృతంగా లెక్కపెడతాడు.

ఈ విధంగా పలు సందర్భాలు సంసార జీవితంలో సంభవించేవి ఉంటాయి. ఇవే అజ్ఞాత సుకృతాలు అనబడతాయి. పైన నిరూపించబడిన వాటిలో యాదృచ్ఛిక సుకృతాల పోటీలో చేరేవి కొన్ని. అనుషంగిక సుకృతాల కోటిలో చేరేవి కొన్ని. ఈ విధంగా ఇటువంటి సుకృతాలను భగవంతుడు తాను గానే గ్రహించి, మనలను అనుగ్రహించడానికి వీటిని కారణాలుగానో, వ్యాజాలుగానో గ్రహిస్తున్నాడు అని ఈ విషయాన్ని మనం శాస్త్రాల ద్వారా తెలుసుకుంటున్నాం. ఇటువంటి సుకృత జ్ఞానం భగవంతునకు ఉన్నది కనుకనే, అతనికి కృతజ్ఞుడు అనే కీర్తి ఏర్పడినది. శ్రీయామునులు "వశీ వదాన్యః" అనే శ్లోకంలో "కృతజ్ఞః" అని ఇంతటి విషయాలను మనస్సులో పెట్టుకునే చెప్పారు.

వాల్మీకి భగవానులు శ్రీరాముని గూర్చి చెప్పేటప్పుడు "కథంచిదుపకారేణ కృతేనైకైన తుష్యతి" అనేటపుడు "కథంచిత్ " అని అనడంకూడా ఇంతటి విషయాలను దృష్టిలో పెట్టుకునే. " కథంచిత్ కృతేన ఉపకారేణ తుష్యతి"– "కథంచిత్" అని అనడంలో ఏమి

తాత్పర్యం? అని గమనించాలి. మనః పూర్వకంగా కాకుండా, ఇంతకు ముందు నిరూపించిన రీతిలో చేయడమే కథంచిత్కారణం– అని తాత్పర్యం.

విభీషణుని అంగీకరించే విషయంలో ఏర్పడిన వాద వివాదాలు తీరి అతనిని తన దగ్గరకు పిలుచుకొని రమ్మని శ్రీరాముడు సుగ్రీవునకు ఆజ్ఞ ఇచ్చేటప్పుడు "ఆనయైనం హరి శ్రేష్ఠ! దత్తమస్యాభయం మయా"– సుగ్రీవ విభీషణనకు నేను అభయాన్ని ఇచ్చాను కనుక అతనిని నీవే నా దగ్గరకు తీసుకొని రా అని పలికి వెంటనే, " విభీషణో వా సుగ్రీవ! యది వా రావణః స్వయమ్" అని అన్నాడు. దీని భావం ఏమంటే సుగ్రీవ నన్ను శరణు పొందానని వచ్చినవాడు విభీషణుడు అని మీరు చెబుతున్నందున, నేను అతనిని అంగీకరిస్తున్నట్లుగా చెప్పాను. ఒకవేళ అతడు విభీషణుడు కాకుండా, రావణుడే అతని వేషాన్ని వేసుకొని వచ్చినట్లుగా తెలిసినప్పటికీ, ఆ "రావణుని అంగీకరించాలా? వద్దా? "అని మళ్లీ ఒక విచారం చేయకుండా, అతనిని కూడా నిరభ్యంతరంగా పిలుచుకుని రా" అని తాత్పర్యం. ఈ విధంగా తన ఉదారమైన మనసును వ్యక్తం చేసే శ్రీరాముడు రావణుని విషయంలో ఏమి సుకృతాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ మాటను చెప్పాడు? అని విచారించినప్పుడు, మహా పాపి అయిన ఆ రావణుని దగ్గర బుద్ధిపూర్వకమైన సుకృతం ఏమీ లేకపోయినాప్పటికీ, పైన వివరించిన రీతిలో యాదృచ్ఛికం మొదలైన సుకృతాలు కనబడే అవకాశం ఉన్నది– అనే నిశ్చయాన్ని చేసుకొనే, ఆ విధంగా శ్రీరాముడు పల్కడం జరిగింది– అని మన ఆచార్యులు

భావిస్తారు. ఈ రీతులను చక్కగా విమర్శించి చూసినప్పుడు "భగవంతుడే ప్రాప్త" అని చెప్పేటట్లు ఉంటుంది. తన సొత్తును కోల్పోకుండా తాను పొందేవాడు అని అర్థం.

# కారణత్వమ్

(తిరువాయ్ మొழிప్రబంధంలోని ద్వితీయశతకసారమ్)

ఉ. వే. శ్రీమాన్. ఆర్. నరసింహాచార్యస్వామివారి(శ్రీరంగం) ద్రావిడ వ్యాసానికి అనువాదం

త్వద్దివ్యసూక్తిపరిశీలన శక్తిహీనః
కుర్యా మహం కథమహో! శఠకోపసూరే!
ఆకస్మికిం తవ కృపా మవలంబ్య కుర్వే
మాయాబలప్రశమనీం వివృతిం సుఖేన.

(ఓ శఠకోపసూరీ! అయ్యో! దేవరవారి దివ్యసుక్తులను పరిశీలించడంలో ఏమాత్రం శక్తి లేని నేను ఏ విధంగా ఏమి వ్రాయగలను? అయినప్పటికీ, అజ్ఞానబలాన్ని పోగొట్టే దేవరవారి నిర్హేతుకకృపను ఆధారంగా చేసికొని, నేను సుఖంగా ఈ వ్యాసాన్ని వ్రాస్తాను).

శ్రియఃపతియై, సకలకళ్యాణగుణాత్మకుడై, "అయర్వఱు మమరర్ కళ్ అధిపతి"యై, అప్రాకృత దివ్యమంగళ విగ్రహ విశిష్టుడైన సర్వేశ్వరుడు నిత్యసంసారియైన ఆళ్వార్లను విశేషంగా కటాక్షించి, " మయర్ వఱ మదినలమ్" అని చెప్పినట్లుగా విస్మృతి మొదలైన దోషాలు లేని భక్తిరూపాపన్న జ్ఞానాన్ని అనుగ్రహించి, " యమేవైష వృణుతే తేన లభ్యః, తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్" (ఈ పరమాత్మ ఏ జీవుని వరిస్తున్నాడో ఆ జీవుని చేతనే పరమాత్మ పొందడానికి సాధ్యమవుతున్నాడు అతనికి పరమాత్మ తన స్వరూపాన్ని

తెలిసికొనేటట్లుగా అనుగ్రహిస్తున్నారడు) అనే విధంగా తన స్వరూప రూప గుణవిభూతులను కరబదరికాన్యాయంలో వారికి స్పష్టంగా దర్శింపజేసి అనుగ్రహించగా, వాటిని దర్శించి ఆనందించిన ఆళ్వారులు, తాము అనుభవించిన రీతిలోనే భగవంతుని గుణాలను, అతడు తమ విషయంలో చేసిన ఉపకారాన్ని తమ వరకే నిలువకుండా, ఈ లోకంలోని మానవులకు కూడా తెలియజేసి, వారిని కూడా సంస్కరించి, లక్ష్మీనాథునకు శేషంగా చేయాలి– అని భావించి, "అరుళ్ కండీర్! ఇవ్వులకినిల్ మిక్కదే" (అళ్వారుల అనుగ్రహాన్ని చూడండి! అది ఈ లోకంలో చాలా గొప్పది కదా) అనే విధంగా ఉండే తమ గొప్ప కృపతో చేసిన ఉపదేశాన్ని సుస్పష్టంగా తెలియజేస్తున్నది– " యాழినిశై వేదత్తియల్"(వీణతంత్రులనుండి పుట్టిన మధురమైన ధ్వనివలె మధురమైనవి) అయిన తిరువాయ్ మొழిలోని ఒక్కొక్క శతకం.

శారీరకంలో "గుణైః స్వభావతశ్చ యత్రానవధికాతిశయః సో ఽ స్య ముఖ్యో ఽర్థః. " (ఎక్కడ, గుణాలతో స్వభావంతో అనవధికమైన అతిశయం ఉన్నదో, అది బ్రహ్మ శబ్దం చేత ప్రధానంగా చెప్పబడుతుంది) అని బ్రహ్మ శబ్దార్థాన్ని వివరించే రీతిలో భగవంతుని పరత్వాన్ని పలికి, "జన్మాద్యస్య యతః" (దేనినుండి, ఈ జగత్తు యొక్క జన్మాదులు సంభవిస్తున్నాయో, అది పరబ్రహ్మం)అనే తరువాత సూత్రంలో పరబ్రహ్మానికి జగత్కారణత్వాన్ని లక్షణంగా చెప్పే రీతిలో పలికినట్లుగా, ఆళ్వార్లు కూడా

మొదటి దశతకంతో భగవంతుని పరత్వాన్ని తెలియజేసి, రెండవ శతకం ద్వారా ఆ స్వామి యొక్క కారణత్వాన్ని పలుకుతున్నారు.

"శోరాద ఎప్పొరుట్కుమ్ ఆదియామ్ శోదిక్కే ఆరాద కాదల్ కురుకూర్ శడగోపన్" (2–1–1)
(దేనికి లోటు లేకుండా, సకల వస్తువులకు ఆదికారణభూతుడైన జ్యోతిస్స్వరూపుని విషయంలోనే తీరని ఆశను కలిగిన తిరునగరిలోని ఆళ్వారులు)

"ఓవా త్తుయర్ పిఱవి ఉట్పడ మఱ్ఱెవ్వైయుమ్
మూవా త్తని ముదలా మూవులకమ్ కావలోన్ "(2–8–5)
(ఎడతెగని దుఃఖాన్ని కలిగించే జన్మ మొదలైనవానికి అన్నింటికిని ఏనాడు విడవకుండా అద్వితీయ కారణభూతుడు, మూడు లోకాలను రక్షించగలిగినవాడు)

"శీర్ మై కొళ్ వీడు శువర్ క్క నరకీడు
ఈర్ మై కొళ్ దేవర్ నడువా మఱ్ఱెప్పొరుట్కుమ్
వేర్ ముదలాయ్ విత్తాయ్ పరందు తనినిన్ఱ
కార్ ముగిల్ పోల్ వణ్ణన్ కణ్ణనై నాన్ కండేనే"(2–8–10)
(గొప్ప మోక్షం, స్వర్గంమొదలైన సకలపురుషార్థాలకు, నరకం మొదలైనవానికి, వీటిని అనుభవించే దేవతలు మొదలుకొని స్థావరాల

వరకు ఉండే సకల వస్తువులకు, మిగిలిన అన్ని వస్తువులకు ఉపాదాన, నిమిత్త, సహకారి కారణ రూపుడై, అంతటా వ్యాపించి ఉండే విలక్షణుడై, నీలమేఘువర్ణుడైన నా స్వామిని నేను దర్శించాను)

4) "పొరుళిన్డి ఇవ్వులకమ్ పడైత్తవన్ పుకழ் మేల్
మరుళిల్ వణ్ కురుకూర్ శడగోపన్
తెరుళ్ కొళ్ల చ్చొన్న ఓరాయిరత్తుళ్ ఇప్పత్తు
అరుళుడైయవన్ తాళ్ అణివిక్కుమ్ ముడిత్తే "(2–10–11)
(ఏనాటికైనా ఉపయోగపడుతుంది– అని భావించి, ఈ లోకాలను సృష్టించిన భగవంతుని కళ్యాణ గుణాలనుగూర్చి ఏ అజ్ఞానం లేనివారు, తిరునగరిలో ఉండేవారైన ఆళ్వారులు ఈ చేతనులకు స్పష్టమైన జ్ఞానం కలిగేటట్లుగా అనుగ్రహించిన వేయి పాశురాలలో, ఈ పది పాశురాలు సంసార బంధాన్ని తీర్చి, కృపాసంపన్నుడైన భగవంతుని చరణాలను పొందిస్తుంది)

అనే ఈ పాశురాలలో సర్వేశ్వరుని కారణత్వాన్ని ఆళ్వారులు అనుగ్రహించారు. ప్రవాహరూపంలో నిత్యమై కొనసాగుతున్నది, దుఃఖాన్ని కలిగించేది అయిన జన్మ మొదలైనవానికి, వాటిని కలిగిన వస్తువులకు అద్వితీయమైన కారణం– సర్వేశ్వరుడైన ఆ భగవానుడు. అతడు, చేతనునులు తనను ఆరాధించాలని భావించి, దానికి తగినట్లుగా ఉపకరణాలను వారికి ఇవ్వగా, ఆ విధంగా ఇచ్చిన ఉపకరణాలతో ఆ

జీవులు అక్రమంలో ప్రవర్తిస్తూ ఉంటే, దానిని చూచి భగవంతుడు "ఇప్పుడు వీరు ఈ విధంగా ప్రవర్తిస్తూ ఉన్నప్పటికీ, కాలక్రమంలో నా పట్ల వీరికి రుచిని కలిగించి సంస్కరించి, క్రమంలో పెడదాం" అని భావించి, వారు నడచే క్రమానికి అనుమతి దానం ఇచ్చి, ఉదాసీనుడై ఉంటాడు. ఈ విధంగా తాను భావించినది తప్పిపోయినప్పటికీ, వేసిన పైరు నిష్ఫలమైపోయిందే! అని కర్షకుడు సోమరితనాన్ని ప్రదర్శించకుండా, వెనుకకు తీయకుండా, మళ్ళీ మళ్ళీ పైరును వేసి, సాగు చేసే ప్రయత్నం చేసేటట్లుగానే, "ఒకసారి కాకపోతే ఇంకొకసారి అయినా ఈ సృష్టి సఫలం అవుతుంది" అని భగవంతుడు సృష్టి చేస్తూ ఉంటాడు. ఆ భగవంతుడే వేరు, మొదలు, విత్తు –అని మూడు కారణాలుగా ఉంటున్నాడు –అని ఆళ్వారులు అంటున్నారు.

లోకంలో కారణాలు ఉపాదాన కారణం, నిమిత్త కారణం, సహకారి కారణం– అని మూడు విధాలు. ఇక్కడ, వేరు అంటే– సహకారి కారణం, ముదల్ అంటే– నిమిత్త కారణం. విత్తు అంటే– సహకారి కారణం. బద్ధులు, ముక్తులు, నిత్యులు అనే మూడు విధాలైన చేతనులకు, ప్రకృతి, నిత్యవిభూతి, కాలం అనే మూడు విధాలైన అచేతనాలకు భగవంతుడు కారణం అవుతున్నాడు. సూక్ష్మ చేతనాచేతన విశిష్టుడై భగవంతుడు ఉపాదాన కారణంగానూ, జ్ఞాన శక్త్యాది గుణాలతో కూడినవాడై సహకారికారణంగానూ, సంకల్ప విశిష్టుడై ఉపాదాన కారణంగానూ అవుతున్నాడు– అని భగవంతుని కారణత్వాన్ని ఆళ్వారులు అనుగ్రహిస్తున్నారు.

ఈ విధంగా త్రివిధకారణభూతుడైన భగవంతుడు తమకు చేసిన ఉపకారాన్ని అళ్వార్లు ఈ విధంగా అనుగ్రహిస్తున్నారు.

"ఒత్తార్ మిక్కారై ఇలైయాయ మామాయా,
ఒత్తా ఎవ్వొరుట్కుమ్ ఉయిరాయ్, ఉన్నై ప్పెఱ్ఱ
అత్తాయాయ్ త్తందైయాయ్ అఱియాదన అఱివిత్త
అత్తా! నీ శెయ్ దన అడియేన్ అఱియేనే"(2–3–2)
(నీకు సాటి వచ్చేవారు, నిన్ను మించినవారు ఎవరూ లేనటువంటి గొప్ప ఆశ్చర్యాన్ని కలిగించే గుణాలను కలవాడా! దేవతిర్యక్ స్థావరాది అన్ని వస్తువులతో సమానంగా అవతరించేవాడా! అన్నిటికీ ప్రాణమై, నన్ను కన్నతల్లివై, తండ్రివై, నాకు తెలియని తత్వహిత పురుషార్థాలను నాకు ఉపదేశించినవాడా! నీవు నాకు చేసిన ఉపకారాలను "ఇంతటివి" అని దాసుడైన నేను తెలియలేను)

అనే పాశురంలో "శరీరమేవ మాతాపితరౌ జనయతః" (ఈ శరీరాన్ని మాత్రమే తల్లిదండ్రులు కలిగిస్తున్నారు) అనే విధంగా అనిత్యమై, నశ్వరమై, దుఃఖాన్ని కలిగించేది అయిన శరీరాన్ని ఇచ్చే తల్లిదండ్రుల వలె కాకుండా, జ్ఞానవికాసాన్ని కలిగించే ఆచార్యుడై, ఉపాయ ప్రదానం చేసి, శ్రీగీతను అనుగ్రహించి, నాకు తెలియనివి అయిన తత్వహిత పురుషార్థాలను సర్వేశ్వరుడు నాకు అనుగ్రహించాడు –అని అంటున్నారు.

ఇందువల్ల ఆళ్వారులు పొందిన ఫలం ఏమంటే–

"మాటి మాటి పల పిఱప్పుమ్ పిఱందు అడియై ఐడైందు ఉళ్ళమ్ తేటి,

ఈటిలిన్బ త్తిరువెళ్ళమ్ యాన్ మూழ்కినన్,

పాటి ప్పాటి అశురర్ తమ్ పల్ కుழாజ్గళ్ నీఱெழ, పాయ్ ప్పఱవై ఒ

న్టేటి వీற்றிరుందాయ్! ఉన్నై ఎన్నుళ్ నీక్కేలెందాయ్!"(2–6–8)

(అనేక జన్మలలో మారి మారి జన్మించి, చివరకు నీ శ్రీచరణాలను ఆశ్రయించి, మనసు ప్రసన్నమై, అంతు లేని ఆనంద ప్రవాహంలో నేను మునిగాను. రాక్షసుల సమూహాలు పూర్తిగా నశించి భస్మం అయ్యేటట్లుగా, వేగాన్ని కలిగిన గరుత్మంతుని అధిరోహించి వేంచేసి ఉండే నా తండ్రీ! నీవు నా నుండి ఏనాడూ దూరం కాకుండా ఉండాలి)

అనే పాశురంలో– మాటిమాటికి అనేక పర్యాయాలు అనేక జన్మలలో మాటి మాటి జన్మిస్తూ ఉండగా, నేను నీ శ్రీచరణాలను ఆశ్రయించి, చిరకాలం లౌకిక విషయ వాసన వల్ల, భగవంతుని పొందనందు వల్ల కలిగిన మనోవ్యథ అంతా తీరి, మనసు తేటపడి, గొప్ప ఆనంద సముద్రంలో నేను మునిగాను. తిరువడి(గరుడుడు), తిరువనందాழ்వాన్{ (ఆదిశేషుడు) మొదలైనవారు అవగాహించే విషయమైన నిన్ను నేను అవగాహించగలిగాను– అని అంటున్నారు.

ఇక్కడ, "ఈటిల్" అని అన్నందున ఐశ్వర్యాన్ని, " ఇరు "అని అన్నందున కైవల్యాన్ని, " ఈటిలిన్బత్తిరువెళ్ళమ్" అని అన్నందున అంతు లేని మహానందాన్ని అళ్వార్లు నిర్దేశించారు.

మనసులో తేటపడిన తరువాత, ఆళ్వార్లు తాము పొందిన స్థితిని ఈ విధంగా తెలియజేశారు.

"వామనన్ ఎన్ మరదకవణ్ణన్ తామరై కణ్ణినన్
కామనై ప్పయందాయ్, ఎన్టు ఎన్టున్ కళ్గల్ పాడియే పణిందు,
తూమన త్తననాయ్ పిఱవి త్తుయర్ నీంగ, ఎన్నై
త్తీమనమ్ కెడుత్తాయ్, ఉనక్కు ఎన్ శెయ్ గేన్? ఎన్ శిరీదరనే!" (2–7–8)

(ఓ శ్రీధరా! వామనమూర్తీ! అని, నా మరతకమణివంటి కాంతిని కలవాడా! అని, పుండరీకాక్షా! అని, మన్మధునకు తండ్రీ! అని కీర్తించి, నీ చరణాలకు నమస్కరించి, పరిశుద్ధమైన మనసును కలవాడునై, నా సంసార దుఃఖం తీరేటట్లుగా, నన్ను చెడ్డ మనసును లేనివాడనుగా చేశావు. నీవు చేసిన ఈ మహోపకారానికి నేను తిరిగి ఏ విధంగా ప్రత్యుపకారాన్ని చేయగలను?)

అనే పాశురంలో ఆళ్వారులు బంధమోక్షాలు రెండిటికి సాధారణమైన మనస్సు కాకుండా, మోక్షానికి అనుకూలమైన మనసును కలిగినవాడను అయ్యేటట్టుగా చేసి, జన్మ వల్ల కలిగే దుఃఖం తీరేటట్లుగా చేసి, నిన్ను, అల్ప విషయాలను సమానంగా కోరి అనుభవించే మనసును నాకు పోగొట్టావు. నిన్ను ఆదరించి కొలిచే మనసును నాకు ఇచ్చావు. ఇందువల్ల అమృతాన్ని, విషయాన్ని సమానంగా భావించి కోరే నా మనసును పోగొట్టావు. నేను అనన్య ప్రయోజనమైన నీ పాదపద్మాన్నే

ఆదరించి కొలిచే మనస్సును కలిగినవాడను అయ్యాను– అని అంటున్నారు.

ఇక్కడ ఆళ్వారులు పలికిన దివ్యసూక్తిలో "మరువి త్తొழுమ్ మనమే తందాయ్" (నిన్ను ఆదరించి కొలిచే మనసును అనుగ్రహించావు) అనే చోట

"తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతి పూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే."
(నన్ను ఏ క్షణంలోనూ విడవకుండా, నన్నే ప్రీతితో స్మరించేవారికి నేను భక్తియోగాన్ని అనుగ్రహిస్తాను. దాని ద్వారా వారు నన్ను పొందుతున్నారు)

అనే శ్లోకంలోని అర్థాన్ని
"తీమనమ్ కెడుత్తాయ్" అనే చోట
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా"

(వారిని నేను మృత్యువు వంటి సంసారంనుండి ఉద్ధరిస్తాను. వారి మనసులో ఉండే అజ్ఞానాన్ని జ్ఞానం అనే ప్రకాశించే దీపంతో నశింప చేస్తాను)
అనే శ్లోకంలోని అర్థం అనుసంధింపబడినదని ఇక్కడ పెద్దలు అనుగ్రహిస్తారు. ఇది ఈ లోతుగా గమనించి చూడదగిన విషయం.

పొరుళిన్టి ఇవ్వులకమ్ పడైత్తవన్ పుక*ళ్* మేల్
మరుళిల్ వణ్ కురుకూర్ శడగోపన్(2–10–11)
("ఏనాటికైనా ఇది ఉపయోగపడుతుంది" అని తలచి, ఈ లోకాలను సృష్టించిన భగవంతుని కల్యాణ గుణాలను గూర్చి పలికిన ఏ అజ్ఞానం లేని ఉదారులైన తిరునగరిలోని ఆళ్వారులు)
అనే పాశురంలో– లోకాన్ని సృష్టించిన భగవంతుని కళ్యాణ గుణాలను గూర్చి నేను ఎటువంటి అజ్ఞానం లేనివాడను అయ్యాను. దానికి కారణం –ఆ స్వామి అనుగ్రహించిన, ఎటువంటి దోషం లేని, భక్తిరూపంగా పరిణమించిన జ్ఞానాన్ని అనుగ్రహించడమే– అని ఆళ్వారులు అంటున్నారు.
భగవంతుని నిర్హేతుక కృపచేత తమకు కలిగిన జ్ఞానానికి ప్రయోజనం మోక్షం కనుక,

కళిప్పుమ్ కవర్ వు మ*ఱ్ఱు* పిఱప్పు ప్పిణి మూప్పు ప్పిఱప్పు మ*ఱ్ఱు*
ఒళిక్కొండ శోదియుమాయ్ ఉడన్ కూడువదు ఎన్రుకొలో!

తుళిక్కిన్ట వానిన్నిలమ్ శుడరాழி శంగేంది
అళిక్కిన్ట మాయప్పిరాన్ అడియార్ కళ్ కుழாజ్గళైయే(2–3–10)
(అల్ప సంతోషం, మనోవ్యథ తీరి, జన్మ, వ్యాధి, ముసలితనం అనేవి తొలగి, మరణం తొలగి, శుద్ధసత్త్వమయమైన జ్ఞాన జ్యోతి స్వరూపలమై, మిక్కిలి కాంతిని కలిగిన చక్రాన్ని, శంఖాన్ని ధరించి, వర్షం కురిసే ఆకాశం, ఈ భూమి – అనే వీటిని రక్షించే ఆశ్చర్య చేష్టితుడైన పరమాత్మయొక్క భక్తుల సమూహాలను నేను చేరి ఆనందించడం ఏనాడో కదా!)

అని అన్ని విషయాల లాభాలాభాల చేత ఏర్పడే ఆనందం, క్లేశం, జన్మ, వ్యాధి, జర, మరణాలు తొలగి, శుద్ధసత్త్వమయమైన, అంతు లేని తేజోరూపమైన తిరుమేనిని కలిగినవారమై, శంఖచక్రాలను ధరించి భూమిని, పరమ పదాన్ని రక్షించే భగవంతుని దాసులైన నిత్యసూరుల గోష్ఠిలో చేరి కలవడం ఎప్పుడో కదా !అని ఆ మోక్షాన్ని పొందడంలో ఉండే ఆశను వల్ల ఆళ్వారులు దానిని అన్వేషించి. దానిని అప్పుడే పొందనందు వల్ల, " వాడి వాడుమ్ ఇవ్వాణుదలే" (2–4–1) (గొప్పగా ప్రకాశించే లలాటాన్ని కలిగిన ఈ పరాంకుశనాయిక మాటిమాటికి వసివాడుతున్నది) అని కొమ్మ విరిగిన చిగురువలె వాడి, ఆ స్వామిని దర్శించాలి– అనే ఆశ వల్ల క్లేశపడి, అగ్నిసమీపంలో ద్రవించే మైనం వలె కరిగి, మనస్సు బాధపడగా వేడి నిట్టూర్పులు విడచి, మిక్కిలి కన్నీరు కార్చి, కలత చెంది, మనసు ద్రవించి, ఆ మనసుకు ఆధారమైన ఆత్మ కూడా శుష్కమై పోగా,

అపుడు, ఆ ఆళ్వారుల ఆర్తిని తీర్చి, సర్వేశ్వరుడు మోక్షాన్ని ఇవ్వడానికి ఆరంభించాడు.

ఆళ్వారుల ఆత్మకు కలిగిన ఈ తాపం తీరేటట్లుగా భగవానుడు ఏ విధంగా చేశాడు? అంటే,

"అందామత్తన్బు శెయ్ దు ఎన్నావి శేర్ అమ్మానుక్కు
అందామ వాఝ్ ముడి శంగు ఆఝి నూల్ ఆరముళ"
(2–5–1) (ఆ పరమపదంలో ఉండే ఆదరం వంటి ఆదరాన్ని నా ఆత్మలో కలవాడై, వచ్చి చేరిన ఆ భగవంతునకు చక్కని మాలను దాల్చిన, కాంతిని కల కిరీటం, శంఖం, చక్రం, యజ్ఞోపవీతం, హారం ఉన్నాయి.)

అని చెప్పిన విధంగా పరమపదంలో ఉండేవారి విషయంలో చూపించే స్నేహాన్ని నా విషయంలో చూపించి, బీటలు తీసిన భూమిలో నీటిని ప్రవహింప చేసినట్లుగా, "ఉళ్ళుళ్ ఆవి ఉలర్ న్దు" (మనసు లోపల ఆత్మ శుష్కించి) అనే విధంగా సృష్టించి పోయిన నా ఆత్మలోకి, గొప్ప దాహం కలిగినవాడు చల్లటి నీటి మడుగులోకి వచ్చి చేరినట్లుగా, వచ్చి చేరి,

"శిక్కెన చ్చిఱుదోరిడముమ్ పుఱ ప్పడా త్తన్నుళ్ళే ఉలకుకళ్
ఒక్కవే విఝుఙ్గి పుకుందాన్, ––– ఎన్ పైందామరైక్కణ్ణన్ " (2–6–2)
(చాలా చిన్న చోటులో అయినా, ఏదీ బయటకు ఉండకుండా ఉండేటట్లు అన్ని లోకాలను తన కడుపులోనికి అమరి ఉండేటట్లుగా ఆరగించిన రీతిలోనే, దృఢంగా నాలోనికి నా చక్కని పుండరీకాక్షుడు అయిన స్వామి ప్రవేశించాడు).

అనే పాశురంలో, "ఆడి యాడి" అనే దశకంలో కలిగిన ఆర్తి చేత ఏర్పడిన తాపం తీరి, కన్నులు చల్లబడిన భగవంతుడు, తాను అళ్వార్లను అనుభవించేటప్పుడు అన్యపరత ఉండకూడదు– అని భావించి, జగద్రక్షణకు తగిన వ్యాపారాన్ని అంతటినీ చేసి, వేరు దేనిలోనూ దృష్టి పెట్టకుండా, అళ్వారులను అనుభవించడం తప్ప, ఇక మరి ఏ ప్రయోజనాన్ని భావించకుండా, " అళ్వార్లను విడచి, ఇక ఎక్కడకు పోను"– అని ప్రవేశించాడు– అని పలికారు.

"శెడియార్ నోయ్ గళ్ ఎల్లామ్ తీర్ న్దు ఎమర్ కీ*ழ்* మేల్ ఎ*ழு* పిఱప్పుమ్ విడియా వెన్నరకత్తు ఎన్టుమ్ శేర్ దల్ మాఱినరే"(2–6–7)
(క్రిందకు, పైకి ఉండే ఏడేడు జన్మలలోని నా వంశంలోనివారి అరణ్యం వలె విస్తరించిన బాధలన్నీ పోగొట్టి, భగవానుడు ఏ నాడూ విరామం లేని, ఘోరమైన సంసారం అనే నరకం లేకుండా చేశాడు.)

అనే పాశురంలో ఆళ్వార్ల సంబంధిసంబంధులను, భగవంతుని తామర పూలవంటి కన్నుల కటాక్షాలతో తప్ప తమ ప్రయత్నంతో పోగొట్టడం అసాధ్యమై, ఏ సమయంలోను తీరి, ఏనాడు వికాసం అనేది లేకుండా అంతు లేని దుఃఖాన్ని తాపాన్ని ఇవ్వగలిగినది అయిన సంసారం అనే నరకం సమీపించే స్వభావాన్ని పోగొట్టి, వారిని ముక్తులుగా చేసిన రీతిని,

"ఎమర్ కీ*ழ்ழு* పిఱప్పుమ్ కేశవన్ తమర్ మా శదిర్ ఇదు పె*ఱ్ఱు* నమ్ముడై వా*ழ்*వు వాయ్ క్కిన్ఱ వా!" (2–7–1)

(నాకు సంబంధించినవారు క్రిందకు పైకి ఏడేడు జన్మలలోను భగవద్భక్తులు అయ్యారు. ఇటువంటి అతివైభవాన్ని పొంది, మా జీవితం చాలా గొప్పగా వర్ధిల్లుతున్నది. ఆశ్చర్యం!)

అనే పాశురంతో తమకు క్రింద ఏడు తరాలవారు, పైన ఏడు తరాలవారు అందరూ తమ సంబంధమే కారణంగా కేశవునకు దాసులు కావడం అనే గొప్ప గతిని పొందారు. " ఎనక్కే అరుళ్ కళ్ శెయ్య విది శూழ்న్దదు ఆల్!" (నా విషయంలో అనుగ్రహించడం కోసం స్వామి కృప ఆక్రమించినది. ఎంత ఆశ్చర్యం!) అనే విధంగా భగవంతుని నిర్హేతుక కృప అనే గొప్ప చాతుర్యాన్ని పొందారు. అందుచేత శ్రీవైష్ణవశ్రీ అనేది ఊట మారకుండా తమ వంశంలో నిరంతరంగా ప్రవహిస్తున్నది కదా! అని అళ్వార్లు ఆశ్చర్యపడి, తమను సర్వేశ్వరుడు ఉజ్జీవింప చేసిన రీతిని గూర్చి పలికారు.

ఈ విధంగా తమ సంబంధిసంబంధుల వరకు ప్రవహించే ప్రీతి చేత భగవంతుడు

" నీందుమ్ తుయరిల్లా వీడు" (2–8–2)

(దుఃఖారహితమైన పరమపదం) అని,

"కెడలిల్ వీడు శెయ్యుమ్"(2–9–11),

(అవ్యయమైన మోక్షాన్ని కలిగిస్తాడు) అని,

" ఎమ్మా వీట్టు త్తిఱముమ్ శెప్పమ్" (2–9–1) అని

(నీ విధాలుగా విలక్షణమైన మోక్షాన్ని గురించిన

ప్రస్తావనను చేయము) అని చెప్పబడిన దాటడానికి సాధ్యం కాని జన్మ మొదలైనవానిని, అపక్షయ వినాశాలను దాటి, ఏ దుఃఖం కూడా లేశం కూడా లేనిది, " తనక్కే యాక ఎనై క్కొళ్ళు మీదే" అని నిశ్చయించిన, అహంకారలేశం కూడా లేనిది, ఐశ్వర్య కైవల్యాలు మొదలైన అల్ప పురుషార్థాలు కాకుండా, చాలా ఉన్నతమైనది అయిన మోక్షాన్ని ఇవ్వడానికి భగవంతుడు ప్రారంభించాడు –అని అన్నారు, ఆళ్వారులు.

అళ్వార్లు నిశ్చయించిన మోక్షస్వరూపం ఏమంటే,

భగవంతుడు తమకోసం మోక్షాన్ని ఇచ్చేవాడైతే, ఆ విధంగా ఇవ్వబడే మోక్షం అహంకారాన్ని కలిగినది కనుక, ఐశ్వర్యం, కైవల్యం వలె అది తమ స్వరూపానికి తగనిది. దానిని గూర్చిన ప్రసంగం కూడా తమకు సహించరానిదిగా ఉంటుంది.

"నిన్ శెమ్మా పాదపఱ్ఱు త్తలై శేర్ త్తు, ఒల్లై అమ్మా ! అడియేన్ వేండువదు ఈదే". (నీ ఎర్రని గొప్ప పాదపద్మాలను నా తలపై చేర్చి, విధాలుగా విలక్షణమైన మోక్షాన్ని గురించిన ప్రస్తావనను కూడా చేయను. స్వామీ! నేను ప్రార్థించేది ఇదే), అందుచేత, " ప్రాప్తశేషి అయిన నీయొక్క, లోపలి భాగంలో ఎర్రనిదై, బయట నల్లగా ఉండేది అయిన, పరమ పూజ్యమైన శ్రీచరణాలను నేను తలపై ధరించాలి"– అని ప్రాప్త శేషి అయిన భగవంతుని స్వరూపానికి, శేషభూతులైన తమ స్వరూపానికి తగినట్లుగా భగవంతుడు తమకు పరమపురుషార్థాన్ని అనుగ్రహించాడు– అని మోక్ష స్వరూపాన్ని నిశ్చయించారు, ఆళ్వారులు.

"పరగతాతిశయాధానేచ్ఛయా ఉపాదేయత్వమేవ యస్య స్వరూపం సః శేషః, పరః శేషీ ఇతి హి శేషశేషిభావలక్షణమ్. శేషభూతశ్చేత్ శేషిణో ఽ తిశయాధానాయైవ హి భవతి. "

(పరుడైన శేషికి ఆనందాన్ని కలిగించాలనే ఇచ్ఛతో గ్రహించదగినదిగా ఉండడం అనేది దేని స్వరూపమో, అది శేషం అనబడుతుంది. పరుడు శేషి అనబడతాడు. – అని కదా శేష శేషిభావలక్షణం చెప్పబడుతున్నది. శేషభూతుడు అయితే అతడు శేషికి ఆనందాన్ని కలిగించడం కోసమే ఉంటాడు కదా)

అనే సూక్తులు ఇక్కడ గమనించదగినవి. దీని అర్థం ఏమంటే– పరునకు ఒక అతిశయాన్ని కలిగించడమే శేషభూతుడై ఉండేవానికి లక్షణం, అంటే, స్వరూపం. అందుకోసమే అతడు ఉన్నాడు. అందువల్ల తమ కైంకర్యంవల్ల, లేక, తనకు మోక్షం ఇవ్వడం వల్ల భగవంతునకు ఆనందాన్ని కలిగించేవాడే శేషభూతుడు. ఈ విధంగా శేషభూతుడు చేసే కైంకర్యాన్ని చూచి ఆనందించేవాడు శేషి అవుతున్నాడు. అందుచేత, ఇద్దరి స్వరూపానికి తగినట్లుగా భగవంతుడు ఆళ్వార్లకు మోక్షాన్ని అనుగ్రహించాడు –అని భావం.

అళ్వార్లు లోకులకు చేసిన ఉపదేశం ఏమంటే,

ఈ విధంగా నిశ్చయించిన ఆళ్వార్లు, " అఱివినాల్ కుఱైవిల్లా అకల్ ఞాలత్తవర్ అఱియ" (ఈ విశాలమైన ప్రపంచంలో ఉండేవారు తెలిసికొని) సన్మార్గంలో ప్రవర్తించి బాగుపడడం కోసం సర్వసమాశ్రయణీయమైన భగవంతుని (మొదటి శతకంలో విశదంగా

చెప్పబడిన) సర్వస్మాత్ పరత్వాన్ని సుప్రతిష్ఠితం చేయడం కోసం ఆవశ్యకమైన ఆ స్వామి యొక్క సకలఫలప్రదత్వాన్ని

"తిణ్ణన్ వీడు ముదల్ ముழுదుమాయ్
ఎణ్ణిన్ మీదియన్ ఎంబెరుమాన్"(2–2–1)
(స్థిరమైన గొప్ప మోక్షం మొదలైన సకల ప్రయోజనాలను ప్రసాదించేవాడై, భావానికి అందనివాడై ఉండే మా స్వామి)

అనే పాశురంలో పరమపదం, ఐశ్వర్యం, కైవల్యం మొదలైన సమస్త ఫలాలను ఇచ్చేవాడు, భగవంతుడు– అని అన్నందున ఆ స్వామియొక్క కారణత్వాన్ని– జ్ఞానశక్త్యాది సమస్త కల్యాణ గుణాలను కలిగినవాడు, తాము అనీశ్వరులు అయినా, సర్వేశ్వరునితో పోలినవారు అనే సంశయాన్ని కలిగించే దేవజాతిని, ఇంకా, మానవులు మొదలైన సమస్త వస్తువులను తన సంకల్పంతోనే సృష్టించగలిగినవాడు– అనే విషయాన్ని సుస్పష్టంగా నిరూపించే "ఆ భగవంతుడు పుండరీకాక్షుడు" అనే విషయాన్ని తెలియజేసే

" తకుమ్ శీర్ తన్ తని ముదలినుళ్ళే
మిగుమ్ దేవమ్ ఎప్పొరుళుమ్ పడైక్క
తకుమ్ కోల త్తామరైక్కణ్ణన్" (2–2–5)
(సృష్టి మొదలైనవానికి తగిన గొప్ప జ్ఞానం మొదలైన గుణాలను కలవాడు, తన, సాటి లేని జగత్కారణమైన సంకల్పంలో తనకంటే వేరైన

బ్రహ్మా మొదలైన దేవతలను, మనుష్యులు మొదలైన అందరిని సృష్టించగలిగినవాడు, అందమైన తామరల వంటి నేత్రాలను కలవాడు)

అనే పాశురంతోను,

"కరుత్తిల్ తేవుమ్ ఎల్లా ప్పొరుళుమ్
 వరుత్తిత్త మాయ ప్పిరానై" (2-2-8)
(తన సంకల్పంలో సమస్త దేవతలను, అన్ని వస్తువులను సృష్టించి, పెంచిన ఆశ్చర్యకరమైన జ్ఞానం, శక్తి మొదలైన గుణాలను కలిగిన స్వామి)

అనే పాశురంలోను,

"--- తన్నుందియుళ్ళే వాయ్ త్త దిశైముకన్ ఇందిరన్ వానవర్ అక్కినాన్ ----"(2-2-9)
(తన నాభిలో సృష్టికార్యాన్ని నిర్వహించగలిగిన చతుర్ముఖుని, ఇంద్రుని, ఇంకా మిగిలిన దేవతలను, దివ్యలోకాలను సృష్టించాడు)
అనే పాశురంలోనూ తెలియజేసి,

"తేవుమ్ ఎప్పొరుళుమ్ పడైక్క
 పూవిల్ నాన్ ముకనై పడైత్త,
 దేవన్ ఎంబెరుమానుక్కల్లాల్
పూవుమ్ పూశనైయుమ్ తగుమే?" (2-2-4)

(దేవతలను ఇంకా అన్నీ వస్తువులను సృష్టించడం కోసం నాభీకమలంలో చతుర్ముఖుని సృష్టించినవాడు, దేవుడైన పరమాత్మకు తప్ప మిగిలినవారికి పూలను, లేపనాలను సమర్పించడం తగునా?)

అనే పాశురంలో దేవజాతిని, ఇంకా మిగిలిన వస్తువులను అన్నిటిని సృష్టించడం కోసంగా ఒక నాభీపద్మంలో చతుర్ముఖుని సృష్టించిన భగవంతుడైన శ్రీకృష్ణునకు తప్ప, మిగిలినవారికి పూలు, చందనం మొదలైన లేపనాలు తగవు. పువ్వులు ఇవ్వడం అనేది సుకుమారునకు, చందనం మొదలైన లేపనాలను ఇవ్వడం అనేది జగత్కారణభూతునకు తగును– అని చెప్పినందున సౌకుమార్యాన్ని, జగత్కారణత్వరూపమైన ప్రాధాన్యాన్ని "తిణ్ణన్ వీడు" అనే పరత్వాన్ని అవతారంలో తెలియజేసే దశకంతోను వ్యక్తం చేశారు, ఆళ్వారులు.

"అణైవదు అరవణైమేల్, పూమ్ పావై ఆకమ్,
పుణర్వదు ఇరువరవర్ ముదలుమ్ తానే,
ఇణైవనామ్ ఎప్పొరుట్కుమ్ వీడు ముదలామ్,
పుణైవన్ పిఱవిక్కడల్ నీందువార్ క్కే" (2–8–1)

(శేషశయనంపై చేరడం, లక్ష్మీదేవి వక్షస్సును సంశ్లేషించడం అనేవి నిత్యవిభూతిలో భగవానుడు చేసే కార్యాలు. ప్రసిద్ధులైన బ్రహ్మరుద్రులు అనే ఇద్దరికీ మొదటి కారణమైనవాడు, తానే. అన్ని వస్తువులకు సజాతీయుడై అవతరించినవాడు, మోక్షాన్ని ప్రసాదించేవాడు ఇతడే. సంసార సాగరాన్ని దాటగోరేవారికి తెప్పగా ఉండేవాడుకూడా ఇతడే)

అనే పాశురంలో–

(అణైవదు అరవణైమేల్)– ఎక్కువ దాహాన్ని కలిగినవాడు చల్లని మడుగులో ప్రవేశించినట్లుగా, భగవంతుడు సౌకుమార్యం సౌగంధ్యం, చల్లదనం– అనే వీటిని సహజంగా కలిగిన ఆదిశేషునిపై శయనిస్తాడు– అనే శేషశాయిత్వాన్ని,

(పూమ్ పావై ఆకమ్ పుణర్వదు) భోగ్యతయే రూపంగా కలిగినది, సహజమైన స్త్రీత్వాన్ని కలిగినది అయిన లక్ష్మీదేవి తోటి సంశ్లేషించి వర్తించడం– అనే శ్రియఃపతిత్వాన్ని,

(ఇణైవనామ్ ఎప్పొరుట్కుమ్) చతుర్ముఖుడు, శివుడు అనే వీరికి కారణభూతుడు అయినందువల్ల ఏర్పడిన పరత్వాన్ని కలవాడు, దేవ మానవ తిర్యక్ స్థావరజాతులు అన్నిటిలోనూ సజాతీయుడై జన్మించేవాడు, భగవంతుడు. చతుర్ముఖుడు, రుద్రుడు– అనే వీరి మధ్య అవతరించి ఉపేంద్రుడు కావడం, దశరథచక్రవర్తి, శ్రీవసుదేవుడు పర్యంతంలో తనను సంకోచింప చేసికొని, ఈ లోకానికి వచ్చి అవతరించడం, మహా వరాహరూపి కావడం, కుబ్జామ్ర వృక్షం కావడం అనే ఆ భగవంతుని అవతారాల వల్ల ఏర్పడిన సౌలభ్యాన్ని ఇక్కడ ఆళ్వారులు తెలుపుతున్నారు.

ఈ విధంగా తనను తాను తక్కువ చేసుకొని భగవంతుడు అవతరించడం ఎందుకోసం? అని అంటే,

(వీడు ముదలామ్) మోక్షాన్ని అనుగ్రహించడం కోసం.

అవతరించినప్పుడు మోక్షాన్ని అనుగ్రహించిన సందర్భాలు ఏమైనా ఉన్నాయా? అని అంటే,

శ్రీరామావతారంలో పెరియ వుడైయార్ అని వ్యవహరింపబడే జటాయువునకు

"మయా త్వం సమనుజ్ఞాతః గచ్ఛ లోకాన్ అనుత్తమాన్"

(నా అనుమతితో ఉన్నతమైన స్థానాన్ని పొందుదువుగాక)

" సంస్కారమకరోత్తస్య బ్రహ్మమేధేన రాఘవః.

స్వ పదం చ దదౌ తస్మై యోగిధ్యేయం సనాతనమ్"

(శ్రీరాముడు బ్రహ్మమేధ సంస్కారంతో జటాయువునకు సంస్కరం చేసి, తన స్థానాన్ని అనుగ్రహించాడు) అనే విధంగా మోక్షాన్ని ఇచ్చాడు.

శ్రీ కృష్ణావతారంలో ఘంటాకర్ణుడు అనే పిశాచానికి

"అక్షయ్యః స్వర్గవాస స్తే యావదింద్రో భవిష్యతి,

నష్టే శక్రే తతః స్వర్గాత్ సాయుజ్యం మమ గచ్ఛతు"

(ఇంద్రుడు ఉన్నంతవరకు, నీకు నాశనం లేని స్వర్గవాసం కలగుగాక. ఇంద్రుడు పోగానే, స్వర్గాన్ని విడచి పెట్టి, నా సాయుజ్యాన్ని పొందగలవు)

అనే విధంగా మోక్షాన్ని అనుగ్రహించాడు –అని ఉన్నందున భగవంతుని మోక్షం ఇచ్చే స్వభావాన్ని,

పులనైందుమేయుమ్ పొఱియైందు నీంగి

నలమంద మిల్లదోర్ నాడు పుగువీర్,

అల ముందు వీయ అశురరై చ్చెఱ్ఱాన్
పల ముందు శీరిల్ పడిమిన్ ఓవాదే" (2–8–4)

(శబ్దం మొదలైన ఐదు విషయాలలోనూ ఆసక్తిని కలిగి ఉండే పంచేంద్రియాల వశం నుండి తప్పుకొని, అంతు లేని ఆనందాన్ని కలిగిన పరమపదాన్ని పొందాలని కోరేవారలారా ! అసురుల బలిమిని సంహరించిన భగవంతుని భోగ్యతను ముందుగా గమనించండి. ఆ స్వామి కళ్యాణ గుణాలలో సదా అవగాహించండి)

అనే పాశురంలో "అంతు లేని మహానందమైన పరమానందాన్ని అర్చిరాది మార్గం ద్వారా పొందాలనే ఆశను కలిగినవారలారా! మీరు భావిస్తున్న విషయంలోని భోగ్యత వల్ల, "సుసుఖం కర్తు మవ్యయమ్" అనే విధంగా సాధన దశలో నుండి ఆరంభించి సుఖరూపంగా ఉండే భగవంతుని కళ్యాణ గుణాలలో అవగాహించండి" అని చెప్పినందువల్ల, భగవంతుని ముముక్షువులచేత ఉపాసింపబడే స్వభావాన్ని ఆళ్వారులు వ్యక్తం చేశారు.

భగవంతుడైన నారాయణుడే సర్వస్మాత్పరుడు –అనే అర్థానికి సాక్షిగా

"కళ్వా! ఎమ్మైయుమ్ ఏழுలకుమ్ నిన్
ఉళ్ళే తోఱ్ఱియ ఇఱైవ !ఎన్ఱు,
వెళ్ళేఱన్ నాన్ముగన్ ఇందిరన్ వానవర్
పుళ్ళూర్ ది కழల్ పణిందు ఏత్తువరే" (2–2–10)

(తెల్లని వర్ణాన్ని కలిగిన ఎద్దును వాహనంగా కలిగిన శివుడు, చతుర్ముఖుడు, ఇంద్రుడు, మిగిలిన దేవతలు కలిసి " ఓ దొంగా! మమ్ములను, అన్ని లోకాలను నీ సంకల్పంతో సృష్టించిన స్వామీ! అని గరుడ వాహనుని శ్రీచరణాలకు మొక్కి నమస్కరిస్తారు)

"స బ్రహ్మ స శివః సేంద్రః" అనే బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు, దేవతలు మొదలైనవారు, భగవంతుడైన నారాయణుడు లక్ష్మీదేవి కలసి ఉండే సన్నివేశంలో దగ్గరకు రాలేకపోయినందున, పాలసముద్రంలో ఈవలి తీరంలోనే నిలచి ఆర్తనాదాలు చేస్తే, వీరికి దర్శనాన్ని ఇవ్వడం కోసం గరుడుని భుజాలపై ఎక్కి స్వామి బయలుదేరగా, ఆ స్వామి శ్రీచరణాలలో వాలి నమస్కరించి, " నీవు అవతరించి సోలవుడపై నిలచి స్వాతంత్ర్యన్ని మరగుపరచుకొని ఆరతంత్ర్యాన్ని ఆరోపించుకొని, నీ పరత్వాన్ని కారణత్వాన్ని ఇతరులు తెలుసుకోవడానికి వీలులేని రీతిలో మరగుపరచుకొని ఉన్నావు అయినప్పటికీ మమ్ములను మేము ఉండే లోకాలను మీ సంకల్పంతో సృష్టించావు అందుచేత మాకు కారణమైన నీవే స్వామివి– అని స్తుతిస్తారు –అని అన్యదేవతల స్తోత్రాలను,

" తీర్ త్తన్ ఉలగళంద శేవడి మేల్ పూందామమ్
శేర్ త్తి, అవైయై శివన్ ముడిమేల్ తాన్ కండు,
పార్ త్తన్ తెళిందొழிన్ద పైన్దుழாయాన్ పెరుమై
పేర్ త్తుమ్ ఒరువరాల్ పేశ క్కిడందదే?" (2–8–6)

(పరమ పవిత్రుడైన, లోకాలను అన్నిటినీ కొలిచినవాడైన శ్రీకృష్ణుని అందమైన శ్రీపాదాలలో అర్జునుడు పూలను సమర్పించి, ఆ పూలనే శివుని తలపై స్వయంగా చూసి ఆ స్వామి వైభవాన్ని స్పష్టంగా తెలిసి కొన్నాడు. అటువంటి ఆ తులసీమాలాధరుని గొప్పతనాన్ని వర్ణించడానికీ ఎవరికైనా సాధ్యం అవుతుందా?)

పాశుపతాస్త్రాన్ని పొందడం కోసం పూలు మొదలైనవానిని తీసుకొని వచ్చి, శివుని ఆరాధించే అర్జునుని చూచి, రక్షించే స్వభావాన్ని కలిగినవాడైన శ్రీకృష్ణుడు "ఆ పూలను నా పాదాలలో సమర్పించు" అని చెప్పగా,

పాదోదకేన స శివః శివోऽ భూత్
శివః శివోऽ భూత్– అని

(పరమాత్మ శ్రీచరణతీర్థంతో రుద్రుడు శుద్ధుడై శివుడు అయ్యాడు) –అని చెప్పినట్లుగా ఆ శ్రీకృష్ణుని శ్రీచరణాలలో ఆ పూలను సమర్పించగా,

పార్థో విజేతా మధుసూధనస్య
పాదారవిందార్పితచిత్రపుష్పమ్,
దదర్శ గంగాధరమౌళిమధ్యే
బభూవ వీరః కృత నిశ్చితార్థః"

(వీరుడు, విజయుడు, కుంతీపుత్రుడైన అర్జునుడు శ్రీకృష్ణుని శ్రీచరణాలలో తాను సమర్పించిన పూలను గంగాధరుడు అయిన రుద్రుని

తలపై చూచి, " శ్రీకృష్ణుడే సర్వస్మాత్పరుడు "అని నిర్ణయించుకున్నాడు.) అనే విధంగా, తాను సమర్పించిన పువ్వులను శివుని తలపై చూచి, పార్థుడు భగవంతుడైన శ్రీకృష్ణుని పరత్వంలో ఎటువంటి కలతను పొందకుండా స్వస్థతను పొందాడు. అర్జునుడు శ్రీకృష్ణుని శ్రీచరణాలలో సమర్పించిన పూలవంటి పువ్వులు కాదు, కతాను స్వయంగా సమర్పించిన పువ్వులనే చూశాడు. వాటినీ కూడా, పక్కన కాకుండా, వాటిని శివుని తలపై పెట్టాడు. అప్పుడు చెప్పగా వినడం కాకుండా, శృతి, స్మృతి మొదలైనవాని వల్ల కాకుండా, తానే స్వయంగా ప్రత్యక్షంగా చూశాడు– అనే ఈ అర్థాన్ని కలిగిన సూక్తి వల్ల "స తు పార్థో మహామనాః"(గీతా భాష్యమ్) అనే విధంగా గొప్ప జ్ఞానాన్ని కలిగిన అర్జునుని ప్రత్యక్షతను ఆళ్వార్లు పై పాశురంలో తెలియజేశారు.

పులనైందు మేయుమ్ పొఱియైందు నీంగి
 నలమంద మిల్లదోర్ నాడు పుగువీర్,
అల మందు వీయ అశురరై చ్చెఱ్ఱాన్
పల ముందు శీరిల్ పడిమిన్ ఓవాదే" (2–8–4)

(శబ్దం మొదలైన ఐదు విషయాలలోనూ ఆసక్తిని కలిగి ఉండే పంచేంద్రియాల వశం నుండి తప్పుకొని, అంతు లేని ఆనందాన్ని కలిగిన పరమపదాన్ని పొందాలని కోరేవారలారా ! అసురుల బలిమిని సంహరించిన భగవంతుని భోగ్యతను ముందుగా గమనించండి. ఆ స్వామి కళ్యాణ గుణాలలో సదా అవగాహించండి).

అనే పాశురంలో ఆ స్వామిని నమస్కరించడానికి ప్రయత్నం చేసేవారికి, "పులనైందు మేయుమ్ పొఱియైందు నీంగి" అని– శబ్దాది విషయాలలో ప్రవేశింప చేసి నశింప చేసే ఇంద్రియ పారవశ్యతను పోగొట్టి –అని అన్నందున అల్ప అస్థిరత్వాది దోషాలు నిండుగా ఉండే పంచేంద్రియాల వల్ల కలిగే సుఖాలను అనుభవించే ఈ లోకజీవనంలోని దుఃఖాన్ని చూపించి, "నలమంద మిల్లదోర్ నాడు పుగువీర్" అని "అంతు లేని మహానంద రూపమై, దేశవిశేషమైన పరమపదంలోకి ప్రవేశించాలని కోరేవారలారా!" అని అన్నందున మోక్షంలోని ఆనందాన్ని తెలిపి, "పల ముందు శీరిల్ పణిమిన్ ఓవాదే" (ప్రారంభం నుండే భోగ్యంగా ఉండే భగవంతుని కల్యాణ గుణాలలో నిరంతరం అవగాహహించండి) అని చెప్పినట్లుగా కొన్ని కార్యాలు ఆరంభంలోనే దుఃఖాన్ని కలిగించేవై, చివరిలో ఆనందకరంగా ఉంటాయి. భగవంతుని కల్యాణ గుణాల అనుభవం, ఆ విధంగా కాకుండా, సుఖమయంగానే ఉన్నందున, ఆరంభక్షణం నుండే ఫలరూపంగానే ఉంటాయి. ఎందుకంటే, ధ్యానింపబడే విషయం మధురంగా ఉన్నందున, ప్రాప్య (గుణానుభవ)దశవలె, సాధన (ధ్యాన)దశలో కూడా భోగ్యంగా ఉన్నందున, ఆనందం ప్రారంభంనుంచే కలిగే కళ్యాణ గుణాలలో అవగాహించండి– అని చెప్పినందున సాధన దశ నుండి కూడా కలిగే ఆనందాన్ని ఆళ్వారులు దర్శింపచేశారు.

వేదాంతాలలో–

దహ్రం విపాప్మం పరవేశ్మ భూతం యత్ పుండరీకం పురమధ్య సంస్థమ్,

తత్రాపి దహ్రం గహనం విశోకః తస్మిన్యదంతః తదుపాసితవ్యమ్" (తైత్తిరీయోపనిషత్)
(శరీరం మధ్యలో తామరపూవువంటి రూపాన్ని కలిగినది, పరమాత్మకు నివాస స్థానమైనది అయిన అల్పమైన హృదయం ఉన్నది. ఆ హృదయం మధ్యలో ప్రకాశించే జ్యోతి స్స్వరూపమై వెలుగుతున్నవాడు, శోకం మొదలైన ఏ దోషాలు లేనివాడు అయిన, చాలా సూక్ష్మరూపుడైన పరమాత్మ ఉన్నాడు. అతనిలో ఉండే గుణాలను ఉపాసించాలి)
2) "అథ యదిదం అస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ, దహరో ౽ స్మిన్ అంతరః ఆకాశః, తస్మిన్ యదంతః తత్ అన్వేష్టవ్యమ్, తద్వావ విజిజ్ఞాసితవ్యమ్" (ఛాందోగ్యోపనిషత్).

(పరబ్రహ్మ యొక్క నివాస స్థానం అయినందున, తొమ్మిది ద్వారాలను కలిగిన గుడిసెవంటిది అయినందున పురంగా చెప్పబడే శరీరంలో అల్పమై, తామర పువ్వువలె ఆకారాన్ని కలిగినదైన హృదయం భగవంతునకు నివాసస్థానం. అందులో ప్రకాశించే జ్యోతియై, తనను చేరినవారిని కూడా జ్యోతిర్మయంగా చేయగలిగిన సూక్ష్మమైన బ్రహ్మం ఉన్నది. ఆ బ్రహ్మంలో ఉన్నదానిని శ్రవణమననాల ద్వారా తెలిసికొని ధ్యానించాలి) అని ఆచార్యుడు శిష్యుని విధించగా,

శిష్యుడు "యదిద అస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరే౽ స్మిన్ అంతర ఆకాశః కిం తత్ర విద్యతే, యదన్వేష్టవ్యం, యదత్ర విజిజ్ఞాసితవ్యమ్?" (శరీరం లోపల తామర పువ్వు రూపాన్ని కలిగిన హృదయం ఉన్నదని, అందులో పరబ్రహ్మం ఉన్నదని, అందులో

ఉన్నదానిని శ్రవణమననాల ద్వారా తెలుసుకొని ధ్యానించాలని మీరు అంటున్నారు. ఆ పరమాత్మ లోపల ఏమి ఉన్నది?) అని అడిగాడు.

అప్పుడు ఆచార్యుడు–
"అస్మిన్ కామాః సమాహితాః, ఏష ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యుః విశోకః అవిజిఘుత్సః ఆపిపాసః సత్యకామః సత్యసంకల్పః"

(ఈ పరమాత్మ లోపల అందరి చేత కోరబడే కల్యాణ గుణాలు ఉన్నాయి. ఈ పరమాత్మ పాపం, ముసలితనం, మరణం, శోకం, ఆకలి, దాహం అనే వీటిని లేనివాడు. సత్య కాముడు. సత్య సంకల్పుడు– అని బదులు ఇచ్చాడు)– అనే ప్రశ్న ప్రతివచనాలద్వారా లోపల నివసిస్తున్న పరమాత్మను, ఆ పరమాత్మ లోపల ఉండే కళ్యాణ గుణాలను ధ్యానించాలి– అని స్పష్టంగా విధింపబడిన ఆ అంతర్గతమైన అపహతపాప్మత్వం మొదలైన పరమాత్మగుణాల ఉపాసనను ఆళ్వారులు
"అల మందు వీయ అశురరై చ్చెற்றான்
పల ముందు శీరిల్ పణిమిన్ ఓవాదే" (2–8–4)

(అసురుల బలిమిని నశింపచేసిన స్వామి కళ్యాణ గుణాలను అవగాహించండి. వాటి అనుభవం ప్రారంభంనుండే భోగ్యంగా ఉంటుంది)అని విధించి, ఆ ఉపాసనకు శాస్త్రాలు నిషేధించినవానిని విడువవలసి ఉన్నందున, వాటిని తెలియజేసి, వాటిని విడిచే రీతిని, ఆ ఉపాసనకు అనురూపమైన దివ్యదేశవాసం మొదలైన అంగాలను

తెలియజేసి, "వాటిని ఆచరించండి"– అని చివరిలో ఉపదేశిస్తున్నారు, ఆళ్వారులు.

"శదిరిళ మడవార్ తాழ்చ్చియై మదియాదు
నిఱముడై వలత్తాల్ తీవినై పెరుక్కి,
వల్ వినై మూழ்కి, నరక்ழுన్ది, కీழ்మై శెయ్ దు, వలమ్ కழித్తు, శూదెన్డు
కళవుమ్ శూదుమ్ శెయ్యాదు, కిళరొళి ఇళమై కెడువదన్ మున్నమ్"

(ఇతరులను వశీకరించుకోగలిగిన సామర్థ్యం, చిన్న వయస్సు అనే వీటిని కలిగిన స్త్రీల విషయంలో మీరు కలిగి ఉండే నీచమైన భావనను ఆదరించి, మిక్కిలి బలంగా ప్రయోజనాంతరాలలో ప్రావణ్యం అనే భావాన్ని వృద్ధి చేసుకొని, మీ చేత పోగొట్టుకోవడానికి వీలు కాని మహాపాపాలలో మునిగి, విశ్లేషం వల్ల కలిగే క్లేశాన్ని అనుభవించి, భగవంతునిలో తప్ప, మిగిలినవానిలో ప్రావణ్యం కలిగి ఉండి, తనను ఆశ్రయించడానికి తగినట్లుగా సర్వేశ్వరుడు ఇచ్చిన మానవ శరీరంతో బలాన్ని పెంచుకొని, తరువాత ఆ స్వామిని ఆశ్రయించకుండా, ఇతరవిషయప్రావణ్యానికి వశమై, అనర్థాన్ని పొంది, "మనకు మంచి ఆదాయం" అని భావించి, చదరంగం మొదలైన వానిని పరద్రవ్యాపహారాన్ని చేసి, చోరులై, వంచకులై, యౌవనాన్ని వ్యర్థంగా గడపకుండా),

1) "బాల్యే ఏవ చరేత్ ధర్మమ్"– (చిన్న వయస్సులోనే ధర్మాన్ని ఆచరించాలి)–అని,

"తస్మాత్ బాల్యే వివేకాత్మా యతేత శ్రేయసే సదా" (అందుచేత మనసులో వివేకాన్ని కలవాడు ఎల్లప్పుడూ చిన్నతనంలోనే శ్రేయస్సు కోసం ప్రయత్నం చేయాలి)
అని చెప్పిన విధంగా చిన్న వయస్సులోనే చేయవలసిన దివ్యదేశవాసాన్ని

2) "వళరిళమ్ పొழిల్ శూழ் మాలిరుమ్ శోలై శార్వదు శదిర్,"
(వృద్ధి చెందగా వృద్ధి చెందగా చిన్న వయసులోనే ఉండే తోటలను చుట్టూ కలిగిన తిరుమాలిరుమ్ శోలై అనే క్షేత్రాన్ని సమీపించడమే చాతుర్యం.)

3)" మాదురు మయిల్ శేర్ మాలిరుమ్ శోలై పోదవிழ் మలైయే పుకువదు పొరుళే".
(ఆడనెమళ్ళతో కలిసి ఉండే మగ నెమళ్లు చేరి ఉండేది, పువ్వులను కలిగి ఉండే తోటలను కలిగినది అయిన తిరుమాలిరుమ్ శోలై క్షేత్రాన్ని సమీపించడమే ఈ ఆత్మకు ప్రయోజనం) అనే పాశురాల ద్వారా,
"మాలిరుమ్ శోలై పదియదు ఏత్తి" అని తిరుమాలిరుమ్ శోలై క్షేత్రాన్ని స్తుతించి ఉజ్జీవించడమే ప్రయోజనం– అని అన్నందున సంకీర్తనాన్ని,
4) "మాలిరుమ్ శోలై తొழ கరుదువదే తుణివదు శూదే" (తిరుమాలిరుమ్ శోలై క్షేత్రాన్ని నమస్కరించాలని దృఢమైన నిశ్చయాన్ని కలిగి ఉండడమే శ్రేయస్సుకు ఉపాయం) అని అన్నందున తిరుమాలిరుమ్ శోలై క్షేత్రాన్ని నమస్కరించాలి – అని మనసులో ఆశపడడం ఒకటే ఈ ఆత్మకు

సంసారాన్ని జయించడానికి తగిన హేతువు– అని అన్నందున అంజలిని,

5) "వలమ్ శెయ్ దు నాళుమ్ మరువుదల్ వ(ళ)క్కే"(తిరుమాలిరుమ్ శోలై క్షేత్రానికి ప్రదక్షిణం చేస్తూ, నిత్యం సుఖంగా ఉండడమే యుక్తమైనది) అనే పాశురంద్వారా నిత్య సూరులు ప్రదక్షిణమనే అనుకూల వృత్తిని చేసే తిరుమాలిరుమ్ శోలై క్షేత్రాన్ని ప్రతి దినం ప్రదక్షణం చేసి సమీపించడం న్యాయ్యం– అని అన్నందున ప్రదక్షిణాన్ని,

6) "మాలిరుమ్ శోలై సెటి పడవదువే నిసైవదు నలమే" (తిరుమాలిరుమ్ శోలై క్షేత్రమార్గంలో పోవాలనే ఆశయాన్ని భావించడమే శ్రేయస్సును కలిగిస్తుంది) అనే పాశురం ద్వారా తిరుమాలిరుమ్ శోలై క్షేత్రానికి పోయే మార్గాన్ని గూర్చి చింతన చేయడమే పురుషార్థం– అని అన్నందున గతి చింతన –అనే ఈ అంగాలను అనుష్ఠించి, భగవంతుని " పలముందు శీరిల్ పణిమిన్" (ఫలం ముందుగా లభించే భగవంతుని కైంకర్యాన్ని చేయండి)– అని ఉపదేశించారు, ఆళ్వారులు.

ఈ విధంగా ఈ రెండవ శతకంలో–

1)భగవంతుని కారణత్వాన్ని తెలియజేయడం,

2)భగవంతుని వల్ల అళ్వార్లు తాము తెలియని విషయాలను ని మనసులో తేటపడడం,

3)జ్ఞానఫలమైన మోక్షాన్ని అన్వేషించి క్లేశపడడం,

4) ఆ క్లేశం తీరేటట్లుగా భగవంతుడు అళ్వార్లకు విశేషమైన అనుగ్రహాన్ని చేసి, మోక్షాన్ని ఇవ్వాలని భావించడం,

5) ఆ మోక్షస్వభావాన్ని ఆళ్వార్లు నిశ్చయించి పలకడం,

6) అళ్వార్లు ఈ లోకంలోనివారికి ఉపదేశించాలని ప్రయత్నం చేసి, విడువవలసిన దానిని విడచిపెట్టి, దివ్యదేశవాసం మొదలైన అంగాలతో కూడిన సగుణబ్రహ్మోపాసనను చేయమని విధించడం–

మొదలైన అమూల్యమైన అర్థాలు తెలుపబడ్డాయి.